కుటుంబ సంక్షేమానికి 'తల్లితండ్రులు'
బాధ్యత ఎంతో పవిత్రమైనదని
నిరూపించే మహోత్తర చిత్రం!



రామ విజేతా ఫిలింస్

# తల్లితండ్రులు

స్క్రీన్‌ప్లే-దర్శకత్వం: కె. బాబూరావు   నిర్మాత: కె. ఎ. ప్రభాకర్

మాటలు:
పినిశెట్టి

సంగీతం:
ఘంటసాల

ఆంధ్ర: జ్యోతి
సీడెడ్: నవభారత్
నైజాం: ఉషా
మైసూరు: విజయా

JOTHEE   STUDIO Ketna







కృష్ణ సమర్పించు

శ్రీ పద్మాలయ మూవీస్




# అగ్నిపరీక్ష

దర్శకత్వం: కె. వరప్రసాదరావు M.A.,

నిర్మాత: జి. ఆదిశేషగిరిరావు



# ఉత్తరాలు

## కథలు

'నేరము—సాక్ష్యము' కథ చాలా బాగుంది. రచయిత న్యాయపతి రాజగోపాలంగారు చాలా గొప్పగా రాశారు. 'నక్షలైట్లు' కార్టూను బాగుంది. 'లవు లెటర్' కూడా చాలా బాగుంది.

యర్రంసెట్టి సూర్యకాంతము [భద్రవరం]

*　　*　　*

'తెగింపు' కథ— కథలా బాగానే ఉన్నా నిజానికి అమాయకపు కన్యలను రెచ్చకొట్టే ధోరణిలో ఉంది. రచయిత కథానాయికి పెండ్లి మాత్రమే ముఖ్యముగా భావించినట్లు అది జరిగితే తల్లి దండ్రులు సంతోషపడినట్లు భావన చేసి, ఆ ఉద్దేశ్యంతోనే కథా నాయికిచేత 'వర్ణాంతరాన్ని నేను ఖాతరు చేయను, జాతి విచక్షణా బేధం నాకు లేదు, అదంటే నాకు మంట'' అనిపించేరు. ఉన్న పరిస్థితుల్లోనే పరివర్తన కల్పించాలి గాని, నియమ, కట్టుబాట్లకు విరుద్ధమైతే అది కుటుంబ సభ్యుల కందరికీ ఒక సమస్య అయి జీవితాంతం వరకూ వెంటాడుతుంది. ప్రస్తుత కథలో తల్లిదండ్రులకు ఎవరు దూరమయ్యారు ?

రుద్రావఝుల రామకృష్ణారావు [భిలాయినగరు]

## సీరియల్

ఒక నవల చదవగానే పరవాలేదు, బాగుంది, లేదా చాలా బాగుంది అని అనిపిస్తే, దాని స్థాయి తెలుస్తుంది. అలా కాక మళ్లీ మళ్లీ చదవాలనిపిస్తే అది నిక్కచ్చిగా చాలా మంచి నవల అని అర్థం. మంచి నవలకు లక్షణాలు ఏమిటో వెదకడం అనవసరం. 'అపరాజిత' మంచి నవల.. చాలా మంచి నవల. రచయిత్రులందరు ఇంతవరకు వ్రాసిన అన్ని నవలల్లోకి ఇదే మంచిదనుకొంటున్నాను. నవల మొదటి నుండి చివరి వరకూ పట్టుగా సాగింది. సన్నివేశాలు, సంఘటనలు గుండెలను పట్టివేశాయి. ఊపిరాడనీయలేదు. వింత పరిస్థితుల్లో మొదలైన కథ అనేకములైన మలుపులు తిరిగి ఎంతో ఉత్సాహజనకంగా సాగింది. 'మాధవి', 'రాధ'తో పాటు మధుపాత్ర కూడా మరపురానిది. రచయిత్రి అందరికి నాహృదయపూర్వక కృతజ్ఞతలు.

ఎం. జయంత్ [సికింద్రాబాదు.]

## న్యూఢిల్లీ లేఖ

ప్రజాస్వామ్య పక్షాల సమీకరణపై పాత కాంగ్రెసు తీర్మానము 'నక్షలైట్ల కన్నా ఘోరం', అంటూ అసహన విమర్శ శ్రీ చవాన్ చేయడము తమకు జరిగిన 'పరాదా తగ్గుదలను' కప్పి పుచ్చేలా వుంది. యీ విమర్శ మొన్నటి దేశీయాంగ శాఖ మంత్రి చేయడము, దేశభద్రతకు ముప్పు తెస్తున్న 'నక్షలైట్ల'కు ఒక విధమైన ప్రోత్సాహన్ని యిస్తున్నట్లు గాదా!

టి. హరనాద్‌గుప్త [పుంగనూరు],

## వ్యాసాలు

19—6—70 మన పత్రికలో "పరిడేలు" నుండి అనంత నరేంద్రరెడ్డిగారు వ్రాసిన ఉత్తరము చదివిన తరువాత ఈ ఉత్తరము వ్రాయాలని పించినది.

తెలంగాణాలో ఉన్న ఒక్క రేడియో కేంద్రము హైదరాబాదు మిక్కిలి శక్తివంతమైనది. ఆంధ్రా చుట్టుప్రక్కల నున్న రాష్ట్రాలలో ఉన్న తెలుగువారు వినడానికి ఉపయోగించేది ఈ స్టేషను. ఆంధ్రాలో ఉన్న 3 ప్రసార కేంద్రములు కడప, విశాఖపట్నం పాయింకాల ప్రసారకేంద్రములు అవన్నీ హైదరాబాద్ కేంద్రములనే రిలే చేస్తాయి. ఇక విజయవాడ స్టేషను ఆంధ్రలో కొన్ని ప్రాంతాలకే వినబడదు. అటువంటి కేంద్రాలు 10 ఉన్న దానికంటే శక్తివంతమైనది ఒక్కటి ఉంటే చాలు.

అందుచేత ఇక నుండి ఇటువంటి వాటిని గూర్చి చర్చించి కాలము వృధా చేయకుండా ఆంధ్రప్రదేశ్‌కు కేంద్రము చేస్తున్న అన్యాయాలు [ఉక్కు ఫ్యాక్టరీ మొ.] గూర్చి చర్చించి కేంద్రముతో దెబ్బలాడాలి.

కల్లూరి వాసుదేవరావు [కాకినాడ—1]

* * *

'తెలంగోడు' చదివిన తర్వాత ఒక ఊహ కలిగింది. 'ఆంధ్ర' శబ్దం తెలంగాణావారికి [కొందరికి?] ఇష్టంలేదు కాబట్టి నేడు ఆంధ్రప్రాంతం అనబడుతున్నచోట ఎక్కడయినా పుట్టిన కవిరేక రచయిత రచనలని తెలంగాణాలో పాఠం పుస్తకాలలో అచ్చు వెయ్యటం మానివెయ్యవచ్చు. తెలంగాణా ప్రాంతంలో వీరి రచనలు కల ఏ పుస్తకం లేక కాగితాన్ని అమ్మటం కాని పంచిపెట్టటం కాని జరగకుండా కొందరు పెద్దలు ఏర్పాట్లు చెయ్యాలి. కొందరు ప్రాచీన కవులు కూడా తెలంగాణా ప్రాంతంలో పుట్టినట్లు వింటాము. చదువుతాము. వీరిని ఆంధ్రప్రాంతం వారు, 'మాకు అక్కరలేదు' అంటారా? అనరని నా ఆశ, నమ్మకం. ఆంధ్రప్రాంతానికి చెందిన నేను తెలంగాణా ప్రాంతం వారి భాషని చదవటానికి వెనుదియ్యను.

'గాన్‌బాక్ ఆంధ్రా' [విజయవాడ]

## ఇది మీకు తెలుసా?

ఇది మీకు తెలుసా? ఇది మాకు తెలియదు. దరిదాపు మందులా వాడొచ్చు దీన్ని. దేన్ని?

దీని జవాబు తర్వాత ఎక్కడన్నా వేశారా? వేస్తారా? లేక పై పత్రికలలో అచ్చు పొరపాటా?

భాగ్యలక్ష్మి సేనాపతి [నాగపూరు.]

ఇది అచ్చు పొరపాటు, పాఠకులు పయుక [illegible] హరించిన వాక్యాలు తెలకపిండికి వర్తించేవి! —సం.

* * *

## గమనిక

10-7-70 సంచికలో 'శభాష్‌రాజా' చిత్రానికి దర్శకత్వం నెరపినవారు శ్రీ పి. ఎస్. రావు అని పొరపాటున ప్రచురింపబడింది. ఆ చిత్రాన్ని డైరెక్టు చేసినవారు శ్రీ పి. రామకృష్ణ అని పాఠకులు గమనించ కోరుతున్నాము. —సం!


# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు:
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం: 24-7-'70
శ్రీసాధారణనామ సం॥ ఆషాఢ మా॥ బహుళ షష్ఠి॥
సంపుటము : 63 సంచిక : 45

స్థాపితము:
1908

ముఖ్య సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1

పోస్టు ద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 26·00 |
| 6 మాసముల చందా | 13·00 |
| 3 మాసముల చందా | 6·50 |


## విషయానుక్రమణిక


అవును, ముఖ్యంగా కావలసింది తోడ్పడే గుణం!
బ్యాంకుల జాతీయీకరణ
నువ్వు చదువుకున్న వాడివి, నక్సలయిట్‌గా ఎందుకు మారావు?
నిరాశ చేత
ఇందిరా కాంగ్రెసును ప్రేమిస్తాను
సంఘటితం
ప్రేమిస్తాను
చరణ్‌సింగ్
పునర్వ్యవస్థీకరించ బడిన ఇందిరా మంత్రివర్గం

# ప్రజాస్వామ్యంపట్ల సోషలిస్టుల వైఖరి...

స్వతంత్ర, జనసంఘం, పాత కాంగ్రెస్‌పార్టీలు ఎన్నికలలో ఒప్పందానికి రావచ్చునని సోషలిస్టులు, ప్రత్యేకంగా శ్రీ జార్జి ఫెర్నాండెస్ భయపడుతున్నారు. ప్రస్తుతం భారతదేశం నలుమూలలో పరిగెత్తుకుంటూ వెళ్ళి 'రియాక్షనరీ'ల వల్ల కలిగే ప్రమాదాన్ని గురించి హెచ్చరించేది ఎవరు, శ్రీ డాంగేగారేనా? కాదు, ఈ పని చేసేది కూడా శ్రీ ఫెర్నాండెస్! కమ్యూనిస్టులు చీలిపోయారని బాధ పడేది కూడా వీరే. సోషలిస్టులలో చీలిక గురించి ఆయనకి అంత బాధగా ఉన్నట్లు కనిపించదు. మళ్ళీ ఆయనే పద్దెనిమిది వామపక్షాలు 'రియాక్షనరీ'లని ఎదిరించటానికి కలిసి పని చెయ్యాలని అంటూ ఉంటారు. రెండు కమ్యూనిస్టుపార్టీలనీ కూడా తీసుకుంటే పాత కాంగ్రెసుతో కలుస్తామని శ్రీ ఫెర్నాండెస్ అంటారు.

## డాంగే కాదు నాథ్‌పయ్

దీని నంతటినీబట్టి మన మొక విషయాన్ని గ్రహించవచ్చు. అది, కమ్యూనిస్టులకన్నా సోషలిస్టులే ప్రమాదకరమయినవారు అనే విషయం. ప్రజాస్వామిక హక్కులని నాశనం చెయ్యటానికి పూనుకున్నది శ్రీ డాంగేకాదు, శ్రీ నాథ్‌పయ్. పెద్ద ఉద్యోగులమీదా, న్యాయాధిపతులమీదా ఉద్యమం లేపినవారు శ్రీ డాంగే కాదు, మధులిమాయే. కమ్యూనిస్టులని వ్యతిరేకించే ఐక్య సంఘటన గురించి విమర్శలు చేసినవారు శ్రీ డాంగే కాదు, పెద్ద సోషలిస్టులలో ఒకరయిన శ్రీ ఫెర్నాండెస్సే...

శ్రీ ఫెర్నాండెస్ ఉద్యమం చూసి భయపడేవారు ఎందరోలేరు. ఉన్నప్పటికీ 'రియాక్షనరీ'లు అనబడే పాత కాంగ్రెసు నాయకులు లేరు.

అసలు సోషలిస్టులతో సంఘటన ప్రభుత్వాలని ఏర్పరచిన వారెవరూ నిలవలేకపోయారు. ఉత్తరప్రదేశంలో భారతీయ క్రాంతిదళం కల సంఘటనని నాశనం చేసినవారు సోషలిస్టులే. సంఘటన ప్రభుత్వం అంటే, సోషలిస్టుల అభిప్రాయంలో, వారి [సోషలిస్టుల] ఆదేశాలని పాటించటమే.

కమ్యూనిస్టులకి వ్యతిరేకంగా ఉండే సంఘట దేనినీ శ్రీ ఫెర్నాండెస్ బలపరచరని స్పష్టంగా తెలిసిపోయింది. ఇన్ని ప్రకటనలు చేశారు, ఒక్కరయినా నక్సలయిటు బీభత్సాలని ఖండించారా? ఈ విలేఖరి ఈ వారమే కొందరు బెంగాలీ యువకులని కలిశారు. వారు సెలవు తీసుకుంటూ చెప్పిన మాటలు నా కళ్ళలో నీరు తిరిగేట్లు చేశాయి. తమలో ఇప్పుడు ఎంతమంది బతికి ఉంటారో చెప్పలేము, అన్నారు కొందరు. అయితే, బెంగాలులో ఏమి జరుగుతుందో— పోనీ మరెక్కడయినా ఏమి జరుగుతోందో—ఎవరు పట్టించుకుంటున్నారు ?

ప్రధానమంత్రిగారు హోమ్ పోర్టుఫోలియో కైవశం చేసుకున్నారు. సెంట్రల్ ఇంటలిజెన్స్ బ్యూరో, సరిహద్దు రక్షణదళం, శాంతి భద్రతలు, కేంద్ర, రాష్ట్ర సంబంధాలు, జమ్మూ—కాశ్మీర్ మాజీ సంస్థానాలు—ఇవన్నీ వారి చేతికిందనే ఉండే శాఖలు.

## బాబూజీ మీద ఆరోపణలు

మేడమ్ ఇందిరాగాంధిగారు ఆర్థికశాఖ తీసుకున్నప్పుడు శ్రీ జగజీవనరామ్‌మీద కొన్ని ఆరోపణలు ఉండేవి. ఇవి పన్నుల లెక్కలకి సంబంధించినవి. ప్రధానమంత్రి ఆర్థిక మంత్రి కూడా అవగానే శ్రీ జగజీవనరామ్‌కి కావలసినంత రక్షణ లభించింది.

కొంతకాలం క్రితం శ్రీమతి అరుణా అసఫాలీ గురించి కొన్ని ఆరోపణలు వినిపించాయి. ఇవి విదేశ ద్రవ్యానికి సంబంధించినవి. ప్రస్తుతం విదేశద్రవ్యం శాఖ హోమ్‌కి మారింది—అంటే ప్రధానమంత్రి చేతిలో వుంది. సెంట్రల్ బ్యూరో ఆఫ్ ఇన్వెస్టిగేషన్‌వారు మొదలు పెట్టిన పరిశోధనలు ఎలాగ నడుస్తాయో చూడాలి.....

ప్రధానమంత్రి ప్రస్తుతం దేశీయాంగ [హోమ్] వ్యవహారాల శాఖని కూడా చూసుకుంటున్నారు. వారు పశ్చిమ బెంగాలులో శాంతి భద్రతల విషయమయి ఏమి చేస్తారు? నక్సలయిట్ల విషయంలో ఏమి చేస్తారు? మాజీ దేశీయాంగమంత్రి మత కలహాలు జరిగిన ప్రాంతాలకి సంబంధించిన నివేదికని స్వయంగా ఆ ప్రాంతాలని చూసిన తర్వాత తయారు చేశారు. అలాగే ప్రధానమంత్రిగారు తామే స్వయంగా ప. బెంగాలుకి వెళ్ళి పరిస్థితిని పరిశీలిస్తారా? నక్సలయిట్ల సమస్యని ఏవిధంగా పరిష్కరించటానికి ప్రయత్నిస్తారు.

## షరతులతో...

ఇదంతా ఇలాగా ఉండగా కమ్యూనిస్టు నాయకులు, ప్రత్యేకంగా శ్రీ డాంగే— మేడమ్ గాంధిగారి మైనారిటీ ప్రభుత్వానికి తమ మద్దతు షరతులు లేకుండా ఉండదన్నారు. పురోగమన విధానాలని అనుసరించినప్పుడు మాత్రమే నేటి ప్రభుత్వానికి తమ మద్దతు ఉంటుందన్నారు. ప్రజలకి వ్యతిరేకంగా ఉండే విధానాలని గనుక శ్రీమతి గాంధిగారి ప్రభుత్వం అనుసరిస్తే తాము ఆ ప్రభుత్వాన్ని బలపరచము అన్నారు' ప్రజలకి వ్యతిరేకం అంటే ఏమిటి? దీనిని నిర్ణయించగలిగింది ఒక్క ఒకడీ కమ్యూనిస్టుపార్టీ యేనని మనం అర్థం చేసుకోవాలి. కేంద్రంలో 'వామ'—ప్రజాస్వామ్య—ఐక్య సంఘటన ఉండటం తమకి ఇష్టం కాగలదని శ్రీ డాంగే సూచిస్తున్నారు.

**శ్రీ డాంగేగారి మాటలని గురించి శ్రీ జార్జి** ఫెర్నాండెస్ ఏమీ చెప్పలేదు. అంటే, కేంద్రంలో కమ్యూనిస్టు ప్రభుత్వం ఉండటం తమకి ఇష్టమనేగా అర్థం? తాము వామపక్షం వయిపేనని మేడమ్ గాంధిగారు అన్నారుగాని ఇంకేవిధంగానూ శ్రీ డాంగే గారి 'కేంద్రంలో కమ్యూనిస్టుల రాజ్యం' కలలని గురించి వ్యాఖ్యానించలేదు.

## పండితుడి గడుసుదనం

మేడమ్ గాంధిగారు ఒక ఉపాయాన్ని ప్రయోగించారు. అది ఫలించలేదు. వారి స్వంత రాష్ట్రమైన ఉత్తరప్రదేశ్‌లో పండిత కమలాపతి త్రిపాఠీ వారు వేసిన వలలో పడటానికి నిరాకరించారు. వారు వేసిన వల ఏమిటి? డిసెంబరు 1970 దాకా కాంగ్రెస్ అధ్యక్షులు.గా ఉండమని శ్రీ త్రిపాఠీని వారుకోరారు. ఆతర్వాత పండిత ద్వారకాప్రసాద్‌మిశ్రా అధ్యక్షులు అవాలని మేడమ్ గాంధిగారు కోరుతున్నట్లు వినికిడి. పండిత త్రిపాఠీకి ఈ వలలో చిక్కుకుంటే వచ్చే ప్రమాదాలేవిటో తెలుసు. తన కంటే పెద్దవారయిన రఫీ అహమ్మద్ కిద్వాయి గోవింద వల్లభపంత్‌లు న్యూఢిల్లీకి వచ్చి ఉత్తరప్రదేశ్‌లో ఎలాగ బలం పోగొట్టుకున్నారో పండిత కమలాపతి త్రిపాఠీకి తెలుసు. ఇది సహేతుకమయిన విషయమే— ఎందుకంటే రాజకీయ నాయకత్వం జమీందారీ కాదు, దూరంగా ఉండి కావలసినది రాబట్టుకొనటానికి. రాజధానిలో కొంతకాలం నిలిచే ఉద్యోగం ఇస్తే వెళ్ళేవారేమో కాని కేవలం నాలుగయిదు నెలలకి సరిపోయే పదవి కోసం స్వంత రాష్ట్రంలో తన పలుకుబడిని నాశనం చేసుకొనటానికి పండిత త్రిపాఠీ అంగీకరించలేదు.

## బాబూజీ తర్వాత పండితులు

ప్రస్తుతం పరిస్థితి చూస్తే బాబూ జగజీవన్ రామ్ 1970 డిసెంబరు దాకా పార్టీ అధ్యక్షులుగా ఉండి ఆతర్వాత పండిత ద్వారకా ప్రసాద్ మిశ్రాకి దారి ఇచ్చేస్తారని ఇక్కడ అనుకుంటున్నారు.

పండిత త్రిపాఠీ దేశానికి మరొక సేవ చేశారు. శ్రీ చరణ్‌సింగ్ ఉ.ప్ర.లో కాంగ్రెసుని నాశనం చెయ్యటానికి పూనుకున్నారని ప్రధానమంత్రికి తెలియజేశారు. అంతేగాక కాంగ్రెసుకు ఇదంతా నష్టకారణంగా ఉందని కూడా చెప్పారు. ఇప్పుడు శ్రీ చరణ్‌సింగ్‌కి కొన్ని అడ్డంకులు తగిలాయి. ఆయనని అదుపులో పెట్టటానికి శ్రీ త్రిపాఠీకి వీలవుతుంది.

ఇదంతా ఇలాగ ఉండగా భారతీయ క్రాంతి దళంలో అధిక సంఖ్యాకులు తమపార్టీ కాంగ్రెసుతో కలవటానికి తమ వ్యతిరేకతని తెలిపారు.

ఉత్తరప్రదేశ్‌లో రెండు కాంగ్రెసు పక్షాలూ **కలిసే అవకాశం వచ్చిందని ఎందరికో తెలీదు.**

ప్రధానమంత్రి నిర్ణయం ప్రకారం ఇది జరిగాలేదు. ఉత్తరప్రదేశ్ సంగతి ఇదీ...

ఇక మధ్యప్రదేశ్‌లో శ్రీ మిశ్రా ఆ రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ శుక్లాతో పోట్లాడుతున్నారు. ఠాకూర్‌సింగ్ అనే ఆయనని శుక్లాకి పోటీగా నిలబెట్టారు. శ్రీ శుక్లా ఆంగ్రే అనే ఆయనని ఆశ్రయించి తన పరిస్థితిని కొంత మెరుగు చేసుకున్నారు. శ్రీ ఆంగ్రే అక్కడ రాజమాత అనుచరులలో ఒకరు. శ్రీ మిశ్రాకి ఇదొక ఓటమి.

## జడ్జి, ప్లీడర్లు

మధ్యప్రదేశ్ ముఖ్యమంత్రి మీద హైకోర్టులో ఒక కేసు ఉంది. హైకోర్టులో కేసుని చూసే జడ్జిగారి సోదరులు ఇద్దరు హఠాత్తుగా గవర్నమెంట్ ప్లీడర్లు అయ్యారు. న్యూఢిల్లీలో శుక్లా శత్రువులు ఈ కథని 'బ్లిట్స్' పత్రికలో వేయించారు. జడ్జిగారు ఆ కేసుని తాము చూడమన్నారు. మరొక ట్రిబ్యూనల్ ఒకటి ఏర్పాటు అవుతోంది.

మహారాష్ట్రలో పరిస్థితులు అంత మెరుగుగా లేవు. శ్రీ దేశాయి అనే మంత్రిగారు రాజీనామా ఇచ్చారు. ఆయన రాజీనామాని స్వీకరించారు.

భారతదేశంలో ప్రతిరాష్ట్రంలోనూ అస్థిమితంగా ఉంది.

'ది గేమ్ ఆఫ్ నేషన్స్' అనే పుస్తకం ఒకటి ఇటీవలే వెలువడింది. రచయిత పేరు మయిల్స్ కోప్‌లాండ్.] అందులో ఒక చోట ఇలా రాసి ఉంది—

"కొన్ని సంవత్సరాలుగా నన్ను ఎందరో అడిగే ప్రశ్న ఒకటి ఉంది. అది ఏమిటంటే 'ఒకవేళ నాసర్‌ని ఒక క్లిష్టపరిస్థితి ఎదుర్కొన్నదనుకో! ఆయన తన దేశాన్ని కాపాడటానికి అధికారాన్ని కోల్పోవలసి వచ్చిందనుకో., అప్పుడు అధికారాన్ని వదులుకుంటాడా లేదా దేశం చెడిపోయినా సరే అధికారంలోనే ఉండాలనుకుంటాడా?' అనే ప్రశ్న.

ఈ ప్రశ్నకి సమాధానం—నాసర్ వంటి నాయకులకి అధికారవ్యామోహం ఎంత ఉందో మనకితెలుసు. అందుచేత తన అధికారాన్ని నిలబెట్టుకొనడానికి దేశాన్ని ఆర్థికంగా నాశనం చెయ్యటానికి కూడా అటువంటి నాయకుడు వెనుదియ్యడని మనం ఊహించవలసి వస్తుంది. అధికారం అధికం అయిన కొద్దీ నాసర్ వంటి నాయకులకి తమ 'వ్యక్తిగతమయిన' విలువ అధికం అవుతూ ఉన్నట్లు అనిపించటం మొదలు పెడుతుంది. ప్రజలకి తమ చేయూత అవసరం అనుకొనడం ప్రారంభిస్తారు. క్రమంగా తాము అందరికన్నా గొప్ప వారమనే నమ్మకం వారిని ఆవహిస్తుంది. అధికారం సంపాదించుకున్న వాడు దానిని మరింత గట్టిచేసుకుని ఇంకా విస్తృతం చెయ్యటానికే ప్రయత్నిస్తాడు., తన స్థానం మరింత బలవంతం కావటానికి ప్రయత్నిస్తాడు, ప్రజల అజమాయిషీ నుంచి తప్పించుకొనటానికి ప్రయత్నిస్తాడు. మూకం కోరికలనీ, ఆశయాలనీ గుర్తించి వాటిని గురించి నినాదాలు లేపితే చాలు. తక్కిన వారికన్నా కొంచెం గట్టిగా అరవాలి, అంతే. కాని, మంచి నాయకుడు కావటం కష్టం. ఎందుకంటే, అప్పుడు మూకలకి ఏది మంచిదో దానినే వారు కోరుకునేట్లు చెయ్యవలసి వస్తుంది.". ●

### గమనిక

ఉత్తరాల శీర్షికకి రాసేవారు ఈ క్రింది నియమాలు పాటించాలని మనవి:

1. ఉత్తరాలు వీలయినంత చిన్నవిగా ఉండాలి 2. రాసేవారి పూర్తి పేరు, చిరునామా ఇవ్వాలి 3. ఇంగ్లీషు లిపిలో అక్షరాలు రాయరాదు 4. కాగితానికి ఒకవయిపునవే రాయాలి. 5. సిరాతోనే రాయాలి. —సం॥




'రాజా, నన్ను నిర్బంధం చేయడం ఇంకా నీవు మానుకోలేక పోతున్నావు. ఒకకథ విను.' అంటూ బేతాళుడు మళ్లీ కథ చెప్పడం ఆరంభించాడు.

కళింగదేశంలో యజ్ఞస్థలమనే అగ్రహారం ఉంది. దానిలో యజ్ఞసోముడనే బ్రాహ్మణుడు ఉన్నాడు. మంచికులంలో పుట్టినవాడు, సోమపానంచేసి పవిత్రుడయిన వాడతాను. అతని భార్యపేరు సోమదత్త. వారిద్దరికీ దేవస్వామి అనే కుమారుడు కలిగాడు. అతడు చంద్రుని లాగ మెరిసిపోతూ, చిన్నతనంలోనే చాల విద్యలు నేర్చాడు.

యౌవనం వచ్చింది. విద్యావినయాలు, సౌభాగ్యలావణ్యాలు అనే అమృతంతో నిండి అమృతకిరణునిలాగ వున్న ఆ దేవస్వామి, కృతాంతుని నిష్కరుణవల్ల, కాలుని శాసనంవల్ల, పూర్వకర్మ వైచిత్ర్యంవల్ల యౌవనంలోనే మరణించాడు. కాలుడు కలిలాగ, నయనోత్సవం కలిగించే లావణ్యం కలిగి, కులాచార గుణాలతో శ్రేష్ఠులయిన విద్వాంసులను చూస్తే, కలతబారిపోతాడు, సహించడు. తలిదండ్రులు శోకంతో పెద్దగా ఏడ్చారు. ఆ ఏడ్పులకు దిక్కులు హోరుగాలులతో ప్రతి విలాపం చేశాయా అనిపించింది.

తర్వాత దేవస్వామి కళేబరాన్ని అంత్య సంస్కారంకోసం సమగ్రగుణబాంధవులయిన బంధువులు శ్మశానానికి తీసుకొని వెళ్లారు. శ్మశానం చీకటిచెట్లు గీపెడు తూండగా వల్లగా భయంకరంగా ఉంది.

శ్మశాన సమీపంలోని మఠంలో ఒక మహావ్రతి ఉండేవాడు. అతడు ఆ అందమైన దేవస్వామి కళేబరాన్ని చూచాడు. 'నేను వృద్ధుణ్ణి, శరీరమా భద్రంగా లేదు. ధ్యానయోగ సమాధులు చేస్తూ, తత్త్వంగురించి వాదించుకొంటూ, మనస్సును కష్టపెట్టుకొంటున్నాను. సుఖాలన్నీ అనుభవించిన ఈ చితికిపోయిన నా కళేబరం వదలి కొత్తదయిన బ్రాహ్మణ యువకుని దేహం ప్రవేశిస్తాను' అని అనుకున్నాడు.

ఇలా అనుకొని, ఆ వ్రతధారి మఠంలో ప్రవేశించి కపాలంమాత్రం చేతిలో పట్టుకొన్నాడు. కన్నీళ్లతో కంఠం గద్గదమవుతుండగా ఏడుస్తూ, దేహమంతా భస్మం అలదుకొన్నాడు. పాములలాగా చేతులను గాలిలో ఎగురవేస్తూ, గాలికి . వినోదంగా జడలు కదలాడుతుండగా రెండవ ధూర్జటి లాగ నాట్యం చేశాడు. పాము తనకుబుసాన్ని వదలి పెడుతున్నట్టు తనవృద్ధ శరీరం వదలి శూన్యగృహంలో ప్రవేశించినట్లు ద్విజకుమారుని ప్రాణరహిత సుందర

యువదేహంలో ప్రవేశించాడు.

బ్రాహ్మణ కుమారునికి నిద్రనుంచి మేలుకొన్నట్టు ప్రాణాలు వచ్చాయి. అక్కడ మూగిన జనం ఆనందంతో కోలాహలం చేశారు. చాలసేపు బంధువులు, తల్లి దండ్రులు అతనిని ఇంటికి రమ్మని ప్రార్థించారు. కాని అతడు కదలలేదు. వెంటనే వైరాగ్యం కలిగి మహా వ్రతం స్వీకరించాడు.

బేతాళుడు ఈకథ చెప్పి. 'రాజా ఆ మహావ్రతి మొట్టమొదట ఎందుకు ఏడ్చాడు! ఎందుకు నృత్యం చేశాడు?' అని ప్రశ్నించాడు.

'బేతాళుడా దానికి కారణం చెబుతాను విను. ఈ శరీరాన్ని ఎంతగానో లాలించాను. చాలకాలం సంబంధం కలిగి వుంది. బాల్యంలో తల్లి పోషించింది. యౌవనంలో సుఖపడ్డాము. ఇప్పుడు ముసలిదయి పోయింది. వదలిపెట్టవలసి వచ్చింది—అని అతడు మనసార ఏడ్చాడు. నేను నూతన శరీరం ప్రవేశించనున్నాను. సద్వ్రతశాలి అయిన నాకుసిద్ధి కలిగింది అని సంతోషంతోను, గర్వంతోను ఆనందం పొంగగా నృత్యం చేశాడు.' అని రాజు సమాధానం చెప్పాడు.

బేతాళుడు రాజు సమాధానం విని బుజంమీదినుంచి ఎగిరిపోయి, శింశుపా వృక్షంమీదకి వాలాడు. రాజు మళ్ళీ వెళ్ళి వెంటనే ఎట్టుకొని బయలుదేరాడు.

బేతాళుడు మళ్ళీ ఇలా అన్నాడు: 'రాజా నీవు మహామతివి. ఏమిటీ నిర్బంధం! వెళ్ళి రాజ్యం అనుభవించు లేదా, ఒక కథవిను.

దక్షిణాపథంలో ధీమంతుడనే మహారాజు ఉండేవాడు. అతడు మహా బలవంతుడు. కాని శత్రువులతో ఓడిపోయి, భార్య కుమార్తెలతో పాటు అడవులు పట్టాడు. భార్య పేరు చంద్రవతి. కుమార్తె పేరు లావణ్యవతి.

అడవులలో చాలదూరం నడిచారు. కాని, వెన్నెలరాత్రి కావడంవల్ల నెమ్మదిగా అలసట తీర్చుకుంటూ, ఒక మహారణ్యం దాటి, ఒక భిల్లుల పల్లెను సమీపించారు. భిల్లుల పల్లెలో ఎటు చూచినా, పులుల చర్మాలు వ్రేలాడుతున్నాయి. నెమలి ఈకల కుచ్చులు, గురువింద దండలు, సిగలో నెమలి ఈకలు కల భిల్లులు కనిపించారు. గైరికాది ధాతువులతో పంచ్యాకాలం కాంతితో ఎర్రగా ఉన్నట్టు వుంది.

భిల్లులు వారిని చూచారు. వారి ఒంటిమీది రత్నాభరణాలకు ఆశపడ్డారు. వారిపై పడ్డారు. రాజు వారితో పోరాడి చాలమందిని చంపి, తను కూలిపోయాడు. రాజు పడిపోగానే, రాణి, భయంతో పులిమీద పడనున్నప్పుడు బెదరిపోయే ఆడలేడిలాగ భయంతో, బరువైన చనుకట్టు, పిరుదులు మరింత ఊగిపోగా, త్రాసంతో మరింత బెదరిపోతున్న కన్ను కలువలతో తెక్కులు చూచే కుమార్తెతోపాటు దిక్కు తెలియక పరుగెత్తింది.

దారిలో లవంగ పూతీగలు, ఏలకి తీగలతో మనోహరంగా ఉండే వనం కనిపించింది. రాణి, కుమార్తె ఆ వనంలో కమలాల సుగంధంతో గమగమలాడే ఒక సరోవరం తీరంలో కూర్చుని అమ్మయ్య అని విశ్రాంతి తీసుకొన్నారు.

చండసింహుడనే క్షత్రియుడు తన కుమారునితోపాటు ఆ వనానికి వేటకోసం వచ్చాడు. అక్కడ ధూళిలో అందంగా ఉన్న స్త్రీల అడుగుజాడలను చూచాడు. ఆ అడుగుజాడలలోని సుందరరేఖలు చూచి ఇద్దరికీ ఆశ్చర్యం కలిగింది. ఆ జాడలను బట్టి ఒక్కతే పాదకమలాలు చిన్నవి, యువతివి అయి వుంటాయని, పొడుగాటి వేళ్ళ ముద్రలున్న పాదాలుగలది ప్రౌఢ అయివుంటుందనీ చండసింహుడు భావించాడు. సింహపరాక్రముడైన తన కుమారునితో ఇలా అన్నాడు. 'ఈ ఇద్దరు స్త్రీలు మన కంటబడితే, పొడుగాటి పాదాలున్నది పెద్దదయి వుంటుంది గనుక నాకు, రెండవది నీకు యోగ్యురాలు.'

వారిద్దరూ, ఇలా నిర్ణయించి, నమ్మ గర్వంగా అనుకున్న, మాట తప్పనివారు. కనుక ఒకవిధంగా ఒట్టుపెట్టుకొన్నట్టు, ఒక నియమం చేసుకొన్నట్టు అయింది. తర్వాత వారు వనమంతా ప్రయత్నంతో గాలించారు. చివరకు ఇద్దరు సుందరులను, పూర్ణేందువదనలను చూచారు. వారిద్దరినీ, తల్లి కుమార్తెలు మాచారు. రాజవంశీయులని నమ్మకం కలిగి వారివెంట వారి పట్టణానికి వెళ్ళారు.

తండ్రీకొడుకుల ఏర్పాటు ప్రకారం పెద్ద పాదాలున్న రాజకన్యను చండసింహుడు స్వీకరించాడు. ఇలా వారిద్దరూ మాటకు కట్టుబడి స్త్రీలను గ్రహించు కున్నారు. కాలక్రమాన వారికి సంతానం కలిగింది.

బేతాళుడు ఈ కథ చెప్పి, 'రాజా, వారిద్దరికి పుట్టిన సంతానానికి పరస్పరం వావి వరుసలేమిటి?' అని ప్రశ్నించాడు.

రాజు ఏమీ నిర్ణయించలేక పోయాడు. ఏమి సమాధానం చెప్పడానికి తోచలేదు. మౌనంగా ఉండిపోయాడు.

బేతాళుడు సంతోషించాడు; అతని ప్రశంసిస్తూ ఇలా అన్నాడు:— 'రాజా, నీ ధైర్యానికి, ప్రజ్ఞాబలానికి ఎంతో శరీరం సంతోషాశ్చర్యాలతో పులకించుతుంది! క్షాంతిశీలుడు పాపి. నిన్ను మోసం చేద్దామని పెద్దగా ఎత్తులు వేశాడు. నీవు తెలివిగలవాడివి. నీవు త్వరలో వానిని మోసం చేయాలి. క్షాంతిశీలుడు దుష్టుడు. ఈ ఘోర మహా ప్రయోగంలో సాష్టాంగం



## ...బృహత్కథామంజరి

ప్రణామం చేయవలసిందిగా నిన్ను కోరుతాడు. అప్పుడు నీవు నెమ్మదిగా ఇలా అను:– నేను ఇంతవరకు సమస్త సామంతులు తమ కిరీటాలు నా పాదాలకు తాకించి నమస్కారం చేయగా, నమస్కారం పొందడానికే అలవాటుపడిన వాడిని. నమస్కారం చేయడమేమిటో నాకు తెలియదు. మీరు నాకు ప్రణామం ఎలా చేయాలో నేర్పండి.—నీవు అలా అనగానే క్షాంతిశీలుడు నీకు నమస్కారంచేయడం చూపుతాడు. అప్పుడు నీవు వాని తలనరికివేయి. లేకపోతే, వాడు నీ తలనరికివేస్తాడు. వాడు విద్యాధరరాజ చక్రవర్తిత్వం కోసం త్రిలోక భూషణుడయిన నిన్ను పశువుగా చేయదలచుకొన్నాడు. అన్నీ నీకు వివరంగా చెప్పినాను. నీకు శుభం. నేను వెళ్ళుతాను.'

బేతాళుడు ఈ విధంగా చెప్పి, ప్రేతం నుంచి వెళ్ళిపోయాడు. రాజు శవాన్ని మోసుకొని క్షాంతిశీలుని వద్దకు వెళ్ళాడు. రాత్రి ఇక కొంతే మిగిలింది. మహోత్సాహంతో కళ్ళు పెద్దవి కాగా, త్వరగా బయలుదేరాడు.

విక్రమసేనుడు రాగానే క్షాంతిశీలుడు చాల సంతోషించాడు. తనకార్యం సిద్ధిస్తుందని ఆ ఆచార్యుడు మహానందపడ్డాడు. రాజు ధర్మమర్యాదను పెద్దగా పొగిడాడు.

చితాభస్మంతో రచించిన మండలంలో రాజు తన బుజంమీది శవం దించాడు. ఆ మండలంచుట్టూ ఎన్నో లాంఛనాలున్నాయి. ఒకవైపు మానవరక్తపూర్ణమయిన కలశం వుంది. మరొకవైపు పెద్దదీపం ధగధగ వెలుగుతూంది.

రాజు శవాన్ని ఆ మండలంలో దించగానే, వ్రతిక్షాంతిశీలుడు దక్షిణాభిముఖంగా నిలబడి, నరరక్తంతో అర్ఘ్యం వదలి, మంత్రాలు పఠిస్తూ, బేతాళున్ని ఆహ్వానించి, ధూపంవేసి, బలిపుష్పాలు సమర్పించి, రాజువైపు తిరిగి 'రాజా, నీ శ్రేయస్సుకోసం ప్రణామం చేయి' అన్నాడు.

'మహావ్రతీ, నాకు ప్రణామమంటే ఏమో తెలియదు. మీరు చూపితే చేస్తాను.' అని రాజు సమాధాన మిచ్చాడు.

దైవమోహితుడయిన క్షాంతిశీలుడు ఆ మాటలు విని ప్రణామం చేయడం ఎట్లాగో రాజుకు చూపాడు.

సాష్టాంగ నమస్కారంలో వున్న వ్రతి తలను రాజు తన ఖడ్గంతో వెంటనే నరికివేశాడు. వెంటనే పుష్పవర్షం కురిసింది. బేతాళుడు, 'రాజా నీ ఈకథ, త్రైలోక్య పూజనీయం కానీ!' అని వరమిచ్చాడు. తర్వాత బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు ప్రత్యక్షమై రాజును పొగడి, వరాలతో అనుగ్రహించారు.

అతనిని చూచి విష్ణువు 'మహీపతీ, నీవు నా అంశ సంభూతుడివి. పూర్వం మ్లేచ్ఛుడయిన శశాంకుని కుమారుడవు విక్రమాదిత్యుడుగా పుట్టావు. తర్వాత యిప్పుడు రాజవంశ విభూషణుడయిన త్రివిక్రమసేనుడయి పుట్టావు. భోగమోక్షప్రదమయిన విద్యాధర రాజ్యసంపదను అనుభవించి త్రిపురాంతకుడయిన శంకరుని వరంతో విద్యాధర చక్రవర్తి పదవిని అనుభవించుతావు.' అని ఆశీర్వదించాడు.

రాజు వారందరి ఆశీర్వాదాలతో ఉదయం తన నగరం ప్రవేశించి, మహాకాంతితో విరాజిల్లినాడు. తర్వాత అతని కీర్తి భూమండలంమీద చంద్రుని అట్టహాస కాంతిలోను, పాతాళంలో ఫణిరాజు ఫణారత్న విస్ఫార కాంతిలాగను, స్వర్గలోకంలో బ్రహ్మవాహనమయిన హంస కాంతి పుంజంగాను కల్పాంతం అనల్ప పుణ్యపదవి అయిన గంగలాగా ప్రకాశించింది.

'ఇలా బ్రాహ్మణుడు నన్ను సమాధానపరచి, బేతాళమంత్రం, ఉత్తమమయినదానిని నాకు ఉపదేశించాడు. నేను సిద్ధిపొంది బేతాళుణ్ని వాహనంగా చేసుకొన్నాను. అతని ప్రభావంవల్లనే నిన్ను ఇక్కడ చూడగలిగాను.' అని విక్రమకేసరి తన కథచెప్పి, మహాసంతోషం పొందాడు.

మృగాంకదత్తుడు మిత్రుడు విక్రమకేసరి కథ విని ఆనందించాడు, శశాంకవతిని స్మరిస్తూ, మళ్ళీ పయనం సాగించాడు. మిత్రులు అతనిని అనుగమించారు.

(ఇంకా ఉంది)




**ఆర్. డి. పి. రాయచూరు**

ఆంధ్ర రచయిత్రుల సమాచార సూచిక వెలువడిందా?

వెలువడింది సుహాసప్రభో! అది దొరికే చిరునామా సవా లక్షసార్లు చెప్పాను కూడా. అకాడమీ వారి కార్యాలయానికి వ్రాయక ఈ ప్రశ్న నాకెందుకు రాస్తారో అర్థం కావడంలేదు.

**వి. ఎస్. ఎన్. ఎమ్, దార్లపూడి**

ఉప సర్పంచ్‌గా ఏకగ్రీవంగా తిరిగి ఎన్నికయ్యాయి...

అభినందనలు స్వీకరించండి మూర్తిగారూ మీలాంటి ఉత్సాహవంతులు ఎంతమందైనా కావాలి పల్లెసీమల ముఖాలు మారాలంటే.

**కె. వి. ఆర్, బరంపురం**

అమ్మాయిల వాడి చూపులకు తట్టుకోవాలంటే ఎలా? నేనింకా బ్రహ్మచారిని.

ముసుకేసుకు కూర్చోండి బ్రహ్మచారీ.

**డి. వి. సి. ద్వారకా తిరుమల**

ప్రేమ అనే రెండు అక్షరాలకు అనుగుణం అయిన అర్థం చెప్తారా?

ప్రేమ మిరపకాయ బజ్జీలాంటిది. కారంగా ఉంటుంది, ఏడిపిస్తుంది—అని తెలిసే—తిన డానికి తహతహలాడుతాం!

**ఒక విద్యార్థి, హైదరాబాదు**

నేనొక కాలేజీ విద్యార్థిని. నేటి ప్రస్తుత పరిస్థితులను చూస్తే నాకు నక్సలైట్లలో కలవాలని ఉంది. అందులో కలవడానికి క్వాలిఫికేషన్లు ఏమిటో? ఎవరితో కలిస్తే వారి ముఠాలో చేర్చుకుంటారో దయచేసి వివరాలు వ్రాయ ప్రార్థన.

'సాయిబూ గోకులాష్టమి ఎప్పుడు?' అన్నట్టు మీ బోటి పెద్ద మనిషి!....నన్ని వివరా లడగడంలో అర్థం లేదు. మీ ఈ వూహ తెలిస్తే వారే పిలుస్తారు లెండి. అంత ఆత్రుత అనర్థదాయకం.

**జె. వి. ఎల్, సికింద్రాబాదు**

రామలక్ష్మి అక్కయ్యగారూ నేను వచ్చి మీ సొంత చెల్లినంట. మీరేమంటారు?

నాకు స్వంత చెల్లె లొద్దంట. మరి దీనికి నువ్వేమంటావు?

**పి. ఆర్. ఆర్, ఉంద్రాజవరం**

గుండెలోన గూడు కట్టె
పిరు లొలుకు వో చిలుకమ్మ
...............
ఆ వొయ్యారపులు భరించు టెట్లు?
మరి ఆ కొమ్మను చేరే దెట్లు?

సిరు లొలికే చిలుకమ్మే అయితే కొమ్మ వంచకు! మాట నరుకుట

**కె. ఎస్. ఆర్, జెక్కం**

మీ జవాబుల్లో అమృతం ఉంటుందని నా నమ్మకం. వాటిలో అమృతం ఎలా చేరుస్తారండీ?

బూరెల్లోకి పూర్ణం, ఎలా వెళ్ళింది? అని అడిగాట్ట వో దొరబిడ్డ. అలా ఉంది మీ అనుమానం. నా ఇంకులో అమృతం కలుపుతానుసార్ అమాత్రం గ్రహించలేదా!

**సి. నా. రా, కోదాడు**

ఇంతవరకు మీకు వ్రాసిన మొత్తం లెక్క చూస్తే అమూల్యమైన జవాబుల కోసం నేను కర్చుపెట్టిన డబ్బు ఒక రూపాయి తొంభయి పైసలు ... ఇంతకీ మీరు సోమసుందరం పక్షమా? శ్రీశ్రీ పక్షమా?

మీరేమంటున్నారో తెలియడం లేదుసార్! ఇంతకీ శ్రీ శ్రీ ఎవరు?! సోమసుందరం ఎవరు?! మీ ఖర్చు కిట్టుబాటుయిందని భావించవచ్చా?]

**ఎన్. వి. ఆర్. ఆర్, కొల్లాపూరు**

మనిషి సమాజానికి (లోకానికి) భయపడతా డెందుకు?

లోకులు కాకులు కదండీ, పొడుస్తారని!

మీ జీవితంలో ఇంతవరకు మీరు ఏం సాధించారు?

ఏమీ సాధించలేదు. కాని చాలా సాధించాము!!

**జి వి. ఎస్, తెనాలి**

శ్రీశ్రీ సన్మాన సభా? ఆరుద్ర అవమాన సభా? మీ అభిప్రాయం ఏమిటి?

ఏ నలుగురు గూండాలో తిట్టినంతమాత్రాన అవమానం అయిపోయిందా! వాళ్ళు తిట్టినది నాకు ఆశ్చర్యంకాదుగాని, శ్రీ శ్రీ మౌనం వహించడం—ఆశ్చర్యం కల్గించింది—నువ్వు రాకపోతే నేనువెళ్ళను. నువ్వు లేకుండా నాకు సన్మానం జరిగితే ప్రిన్స్ ఆఫ్ డెన్మార్క్ లేకుండా హేమ్‌లెట్ నాటకం ఆడినట్టుంటుంది. నువ్వు వచ్చి తీరాలని అన్న శ్రీ శ్రీ ఉత్తర ప్రత్యుత్తరాలన్నీ చూపిన శ్రీ శ్రీ మౌనం మహిమా అన్నదే వింత!

**ఎమ్. ఆర్. వి; ఎన్. కె, మదనపల్లి**

గొలుసు నవలలో మొదట రచయితలు కలసి కథ ఎన్నుకొని వారికి నచ్చిన శైలిలో కథ రాస్తారా? లేక ఎవరెవరి ఇష్ట ప్రకారం కథ రాస్తారా?

ఎవరివెవరి ఇష్ట ప్రకారం కథ రాస్తే తాడూ బొంగరం లేకుండా తయారవుతుంది. కథ సారాంశంగా కథ ఏమిటని సూచాయగా అనుకొని ఎవరి భాగం వారు డెవలప్ చేస్తారు.

**బి ఎస్. ఆర్. కె. అమ్మంపాలెం**

మీకు గాని మీ భర్తగారికి గాని హాని కల్గించే ప్రశ్నలకు జవాబు లివ్వడానికి సంకోచిస్తారా?

ప్రశ్నలో హానెలా కల్గుతుంది? ఫరవాలేదు—ఏం అడగాలనుందో అడగండి!

**డి. ఎన్. ఆర్, కడప**

ఎదురీత అంటే ఏమిటి?

పరిస్థితులలో జానెసత్తై తలొంచి పోకుండా నమ్మిన దానికోసం, కావలసిన దానికోసం కష్ట నిష్ఠూరాలను లెక్క చేయకుండా తన దారిన పోవడం భీని చెప్పుకోవచ్చు....కొందరికి కబుర్లు మాని పని చెయ్యడం కూడా ఎదురీతే కావచ్చు!

**ఎ. ఆర్. ఆర్, కుద్దారోడ్డు**

'పవిత్రత' అన్నది స్త్రీ పురుషులకు సమానముగా ఎందుకు లేదు?

ఎందుకులేదు?!

**బి. వి. ఆర్, కర్నూలు**

'ధైర్యే సాహసే లక్ష్మీ'అన్న సూత్రం ప్రకారం సినిమాల్లో నాకు ఛాన్సు లభిస్తుందా?

చాన్సులన్నవి ఎప్పుడూ ఒకటి యాస్పు ఒకటి నిష్పత్తిలో ఉంటాయి రావుగారూ, ఒక ఛాన్సు వోటమి అయితే వోసారి గెలుపైతే అవచ్చు. అవాలని రూలులేదు—అందుకే చాన్సుతీసుకోవడం అంటారు కాబోలు!

**వి. వి. ఆర్. బి, కొత్తూరు**

చూడండి రావుడుగారూ, మీ వరస చాలా రోజులనుంచీ గమనిస్తున్నాను ... ఇకనుంచైనా ... ?

చిత్తం వీరభద్రుడగా ఇంకొన్నాళ్ళు గమనించు—మంచిది. . . . . 'క్షణ క్షణముల్ జవరాండ్ర చిత్తముల్' ఏమోగాని రంగులుమార్చే వూసరవెల్లిని కాదు నేను.నాకు నిజమనిపిస్తే చెప్పేయడానికి వెనుకాడను. ముఖస్తుతి పరనిందా కూడా అలవాటులేదు నాకు. అంతేకాదు— ఏదో అనడానికింకేదో వంక పెట్టే పిరికితనం కూడాలేదు. 'టు హాంగ్ ఎ డాగ్ యు నీడ్‌నాట్ పెమిట్ మేడ్!' అని నా నమ్మకం.

# కాఫీధర పెరుగుదల
# నరికట్టుట చౌకధరకు
# మేలురకం
# మిశ్రమ కాఫీపొడి



మార్కెటులో కాఫీ ధరలు పెరిగిపోతూంటాన్ని గమనించి కాఫీ బోర్డు ఈ పెరుగుదలను అరికట్టడానికి తోడ్పడ నిశ్చయించుకున్నది.

1970, జూలై 15 నుంచి కాఫీ బోర్డు తన అన్ని కాఫీ డిపోలద్వారాను మేలురకపు మిశ్రమ కాఫీ పొడిని మాత్రమే 500 గ్రాములు రు. 4-68ల నికరపు ధరకు (స్థానిక పన్ను మరియు అమ్మకపు పన్ను చేరకుండ) అమ్ముతుంది. ఈ ధర వచ్చే ఆరు నెలలవరకు ఇలాగే ఉంచబడుతుంది.

100 గ్రాముల, 250 గ్రాముల సీలువేయబడిన ప్యాకెట్లలో ఒక్కొక్కదానిమీద ధర ముద్రవేయబడి లభించే ఈ కాఫీపొడి నాణ్యమైన గింజలు కాఫీ విషయం కూలంకషంగా తెలిసిన వారిచే తాజాగా వేయించబడి, ఖరపట్టించబడిన మేలురకం మిశ్రమమై యుంటుంది.

మీకు కావలసిన మొత్తం కాఫీ పొడిని దిగువ తెల్పిన ఇండియా కాఫీ డిపోలలో ఎక్కడనైనా కొనుక్కొనవలసినదిగ మిమ్ము ఆహ్వానిస్తున్నాము.

- స్టేషన్ రోడ్డు, (ద్వారకా టాకీస్ ప్రక్కను) ఆదోని.
- 5-9-324, మెయిన్ రోడ్డు, గన్ ఫౌండ్రీ, హైదరాబాద్
- 10/164, లక్ష్మివారపేట, రాజమండ్రి
- ఏలూరు రోడ్డు, విజయవాడ
- పారిజాత బిల్డింగ్. 11-100, మెయిన్ రోడ్డు, విశాఖపట్నం
- స్టేషన్ రోడ్డు, వరంగల్




కాఫీ బోర్డు
బెంగుళూరు

FDSCB-1451 TE A.

# ఒక వారం విపరీతం

శాలాక్షుడు

కలకత్తా నుంచి ఒకామె ఢిల్లీవచ్చి రిక్షామీద గాంధీనగర్ బయలు దేరిందట. రిక్షావాడు గాంధీనగరంగాకుండా మాయాపురానికి ఆమెను తీసుకుపోయి, ఓయింటిలో అతనూ, మరో ఏడు మందుగురూ కలిసి ఆమెను బలాత్కరించి. ఆనక్కోయింట్లో వదిలేసి, తాళం వేస్తే ఆమె ఎలాగో తప్పించుకుందట—పాపం కానీ ఏంలాభం!! సంఘం అలాటివారినాదరిస్తోందా!!

## ఏ పొట్టలో ఏముందో...!

కిలుక్ అనే 19 ఏళ్ళ కుర్రాడు కడుపు నొప్పి బాధతో అని మెలికలు తిరిగి పోతుంటే అతన్ని ఎర్నాకులం జనరల్ ఆసుపత్రిలో చేర్చారట.




డాక్టరు సుబ్రహ్మణ్యం అనే ఆయన ఆపరేషన్ చేసి, అతని పొట్టలోంచి ఆరు నెలల పసిగుడ్డును బయటకి తీశాడట. మగవాళ్ళ కడుపులకి పిండమాయన్... కడుపు నొప్పి వంటిది వస్తే జాగ్రత్త పడాలి.. ఏపొట్టలో ఏముందో ఎవరికెరుక !

## రాజధానిలో రాక్షస కృత్యాలు

కొన్నిరంగాల్లో చూస్తే పైదేశాలకు మనదేశం ఏమాత్రం తీసిపోదని చెప్పవచ్చు. ఢిల్లీలో కృష్ణలాల్ అనే అతను, అతని భార్య షీలా సినిమానుంచి తిరిగి వస్తుండగా దారిలో వారి రిక్షాను మరోరిక్షా ఆపిందట. అందులోంచి పోయిన్నరు పెద్దమను ష్యులు దిగి, ఆ భార్య భర్తల నిద్దరినీ కత్తులతో భయపెట్టి పత్తర్‌గంజుకు తీసుకుపోయారట. అక్కడ భర్త ఎదుట ఆమెను ఆరుగురు బలాత్కరించి ఆనక అతన్నక్కడే వదిలిపెట్టి, ఆమెను మాత్రం ఎక్కడికో తీసుకు పోయారట. వారి బారినుంచి తప్పించుకున్న కృష్ణలాల్ పోలీసులకు యీ విషయం చెప్పి, వారు తన భార్యను జి. బి. రోడ్డుకు తీసుకు పోవాలను కోడం విన్నానని చెప్పాడట. పోలీసులు ఆక్కాతో వెతికి ఆమెను కనుక్కున్నారట. ఆమెను పట్టుకున్నయిల్లు వ్యభిచారుల గృహమట, ఎత్తుకు పోయిన వారామెను వ్యభిచారుల గృహానికి అమ్మేశారట. ఈరకంగా ఆ వ్యభిచార గృహాలకు కుల స్త్రీలను పంపిణీ చేసే బీరా అనే వ్యక్తిని అనుమానించి, చట్టం అతని కోసం వెతుకుతోంది. తలకి పేలుపట్టి తెగులు పుట్టినట్లు దేశరాజధాని ఢిల్లీలో యిలాటివి జరిగితే యింకెక్కడ చెప్పుకోవాలి— దేశపురోగతం యిదేనా!

## అభిమానం - ఆత్మహత్య

తన పర్సు తీసిందన్న అనుమానంతో మారిముత్తు అనే అతను తన భార్య గోవిందమ్మను తిట్టిపోశాడట. తనమీద లేనిపోని దొంగతనం అంటగట్టి అవమానించాడన్న అభిమానంతో ఆమె నూతిలోదూకి ఆత్మహత్య చేసుకుందట. ఇది సుబ్రహ్మణ్య పురంలో జరిగింది.

* * *

పదిమంది పిల్లల తండ్రి 55 ఏళ్ల పచ్చ ముత్తు అనే ఆసామి తన సంతానం అంతా ఆడవాళ్ళే నని, కొడుకులేని సంతానమో సంతానం కాదని, కనుక మగసంతానం కోసం తను తిరిగి వివాహించేసుకోదలచాడట. ఈ నిర్ణయానికాతని భార్య పబ్బమ్మ ఒప్పక, అలిగి పొట్టాడ కొత్తకుడ్డె అనే వూరెళ్ళి పోయిందట. ఈ విషయం తేల్చ డానికి పచ్చముత్తు అక్కడకూ వెళ్ళి ఫలితం లేనందువల్ల ఆగ్రహం ఆవేశంతో ఆమెను పొడిచి చంపేశాడట. భార్యకు కత్తిపోటు సరిగా తగిలిందో లేదోనని పోదుప్పు క్రతో బుర్రమీద బాదాడట కూడా నాయన.

## మగవాడుగా మారిన మగువ

మధురకు చెందిన మీనాక్షినాయకం పట్టి అనే వూరులో రైలు మాస్టరుగా వుంటున్న పళనిసామి అనే అతనికి ఏడుగురు పిల్లలట. ఈ పిల్లల్లో పెద్ద పిల్ల 19 ఏళ్ళ సరోజిని 10 వ క్లాసు చదువుతోందట. ఆమెకోనాడు వున్నటుండి శరీరంలో భరించరాని నొప్పి పుట్టిందట. చికిత్సకు ఆమెను పేలారు ఆస్పత్రిలో చేర్చారట. అక్కడ ఆమె చికిత్సానంతరం క్రమేణా మగపిల్లాడిగా మారిందట. సరోజిని రోజిలో చికిత్సకు వెళ్ళిన యీమె ఆసుపత్రినుంచి తిరిగి వచ్చేటపుడు ప్యాంటు షర్టుతో నూతన జీవితంలోకి ప్రవేశించిందట. తన స్నేహితురాలిని వివాహం చేసుకోదల్చు కున్నట్లు, తనపేరుఆష్టలింగంగా మార్చుకున్నట్లూ ఆమె ప్రకటించిందట



18 ఏళ్ల వసంత అనే ఆమె తన ఏడాది పసిగుడ్డును నడుంకు కట్టుకుని, నూతిలోదూకి, శిశుహత్య చేసి, ఆత్మహత్య చేసుకుందట. ఈ దారుణ

## ఒకవారం విపరీతం

చర్యకు భర్తమీద అయిష్టత్తే కారణమని తెలిసినా అయిష్టానికి కారణం మింకా తేల లేదు.

## ఆత్మహత్యకి పాల్పడ్డ ప్రేమికులు

పార్థసారథి అనే వో 27 ఏళ్ళ యువకుడు బెంగుళూరుకు చెందిన రత్న అనే ఒకామెను ప్రేమించాట్ట. అతనికి లోగడే పెళ్ళయిపోయినందు వల్ల యీ ప్రేమ ఆస్థితిలోనే వుండిపోయిందట. ఈ జంట జూన్ 27వ తేదీ అర్కోణంలో వో హొటల్లో రూము తీసుకున్నారట. 28వ తేదీ వుదయం ఆట సినిమాకి వెళ్ళి వచ్చారట. ఆనక 29వ తేదీన వరకు తలుపులు తెరవక పోయే సరికి ఆ హొటలు యజమాని పోలీసులకి సమాచారం చెప్పాడట. వాళ్ళొచ్చి తలుపులు పగల తీసి చూస్తే వారిద్దరూ ఒకే మంచంమీద కౌగలించుకుని వున్న స్థితిలో చనిపోయి వున్నారట. పార్థసారథి రాసిపెట్టిన ఒక వుత్తరంలో 'అమ్మవమ్మా! నాభార్యకు, కొడుక్కు నీవే దిక్కు. మా యిద్దరి శవాలూ ఒకే గోతిలో పాతిపెట్టాలి" అని రాశాడట.

## తాడితన్నేవాడుంటే..!

బొంబాయినుంచి బెల్గామ్ వస్తున్న వో ప్రయాణికుల బస్సును ఎక్సయిజు శాఖవారు ఆపి, అను



మానంతో సోదా చేస్తూ వోవ్యక్తి పొట్టమీద చెయ్ వేసేసరికావ్యక్తి వులిక్కి పడ్డాడట. ఆతని వులికి పాటులో రహస్యం వుందని అతన్ని అదే పద్ధతిలో వులిక్కిపడ్డ మరొకన్నీ కొలా పూరు సివిల్ ఆసుపత్రికి తీసుకువెళ్లి వారిచేత నిజాన్ని కక్కించారట. అనగా వారి పొట్టలో వున్న 35 వేల ఖరీదు గల బంగారం బిస్కట్లను కక్కించారట. అతి తెలివిగా బంగారం బిసరాట్లను వారు మింగితే ఎక్సయిజు వారింకా తెలివిగా అవి కక్కించారట. అమ్మమ్మమ్మమ్మ.... అనకూడదు గానీ ఎక్సయిజు శాఖవారు దేవాంతకులన్మండి! ●




సందె వెన్నెల నీలినీడలతో సరసమాడే వేళ. ఇందిర తన యింటిముందున్న చిన్న తోటలో పచార్లు చేస్తోంది. అప్పుడే విచ్చిన దొంతర మల్లెలు దోసిట నింపుకొని వాటిని ఎగరవేసి పట్టుకొంటూ ఏదో ఆలోచిస్తోంది.

జుమ్మరచిన యింటిపైన బీర పువ్వులు విరివిగా విచ్చాయి. నీలి ఆకాశం మీద సౌందర్యదేవత చిరునవ్వులాగా నెలవంక ఉదయించింది. ఆ చిరువెలుగులు నందివర్ధనపు మొగ్గలమీద చిటికలువేసి విరబూయమని విజ్ఞప్తులు చేస్తున్నాయి. ఇందిరతల్లి ఇంట్లోనుంచి 'ఆలమందలనుకాసే అల్లరి కృష్ణయ్యా' అని పాడుతోంది.

ఇంతలో ఒక కారువచ్చి గేటుముందు ఆగింది. ఇందిర పరుగెత్తుకొని వెళ్ళింది. సులోచన కారుదిగి లోపలకు వచ్చింది ముసి ముసి నవ్వులు నవ్వుతూ.

'ఇందాకనే వద్దామనుకొన్నాను. ఇప్పటికి తీరుబడి అయింది ఇందిరా!' అంది సులోచన. ఇందిర నవ్వుతూ ముందు నడిచింది. ఇద్దరూ వచ్చి పచ్చికమీద కూర్చున్నారు. మల్లెమొగ్గల్ని మధ్యగా కుప్పబోసింది ఇందిర!

'నాలుగుసార్లు కబురుపంపావు నాకోసం. ఏమిటి విశేషం!' అన్నది సులోచన.

'విసిగించానా?' అతి వినయపూర్వకంగా అడిగింది ఇందిర.

'విసుగేమిటి? వేదనే కల్పించావు! ఇన్నిమాట్లు పిలిపించుకొంటున్నానేమిటా? అనేదే వేదన' అన్నది సులోచన! ఇద్దరూ నవ్వుకొన్నారు. ఇందిర కొంచెం సేపు మౌనంగా వుంది. మల్లెమొగ్గలు ఒక్కొక్కటే తీసి వేరుగా కుప్పపోస్తోంది.

'నాతో మాట్లాడటానికే యింత అభినయిస్తున్నావు—మగరాయుడితో అయితే...' అన్నది సులోచన. ఇందిర సిగ్గుతో చలించి, స్నేహితురాలిపైన ఒక మొగ్గవిసిరింది — అలాటి సంభాషణలు చాలించమన్నట్లు. అప్పుడు మెల్లగా విజ్ఞప్తి ప్రారంభించింది—.

'సులోచనా నువ్వు నాకోసహాయం చెయ్యాలి. నా భావిజీవనమంతా నీపైన ఆధారపడి వుంటుంది.'

'అంత బాధ్యత నామీద పెడుతున్నావా! ఎలాటి బాధ్యతైనా వహిస్తాను. మన స్నేహానికి అంచులులేవు ఇందిరా!' అను

రాగపూరితమైన నీ హృదయాన్ని రాగరంజితం చెయ్యాలనే అభిలాష నాలో ఎప్పుడూ మెదులుతూనే వుంటుంది. కాని ఇంతవరకూ దానికి రూపకల్పన చెయ్యలేకపోయాను. నీ కోరికద్వారా అది నెరవేరితే నామనస్సు ఎంతో సంతృప్తి చెందుతుంది' అన్నది సులోచన—ఇందిర చేతుల్ని తనచేతుల్లోకి తీసుకొంటూ—

'ప్రతి స్త్రీ పురుషుని ఆశ్రయమనే శీతలచ్ఛాయల్లో చేరి నృత్యంచెయ్యాలని అభిలషిస్తుంది. కాని కొందరి స్వప్నాలు శూన్యంలోకి దూసుకుపోతాయి. అలాటి జీవితాలకు నిష్కృతి మృగ్యమవుతుంది! అందువల్ల ఒక పురుషుని ఎన్నుకోవడంలో ఎంతో జాగ్రత్త అవసరం' అని ఇందిర కొంచెంసేపు ఊరుకొంది.

'చెప్పు ఇందిరా! నీ గంభీర హృదయంలోనుంచి వచ్చే ప్రతి పలుకూ నా మనస్సులో స్పటికంగా మెరుస్తుంది. నీలాటి మిత్రురాల్ని సంపాదించుకొన్నందుకు నేనెంతో గర్విస్తూ వుంటాను' అంది సులోచన.

'సంశయం కాదు సులోచనా! నాకు శేఖర్ అంటే ఎంతో అభిమానం. అర్థించకుండానే అతనిలో నామీద అనురాగం ఏర్పడింది. అతనికిమాత్రం నా ప్రేమ విషయం తెలియనియ్యలేదు.

# దోసెడు మల్లె మొగ్గలు

అతడే అనేకసార్లు తన అభిమతం తెలియచేశాడు. నేను నా హృదయాన్ని దాచి కఠినత్వం ప్రదర్శిస్తూ తిరస్కరిస్తున్నట్లు అభినయిస్తున్నాను. ఆ ప్రసన్న స్వరూపం చూచి ఒక ప్రక్క తన్మయురాలినవుతూనే, ఒక ప్రక్క తాత్విక చింతనలో మునిగివున్నట్లు మాట్లాడుతూ హృదయాన్ని దాచిపుచ్చుకొన్నాను.

'ఏరోజుకారోజు సందెదాటిన అరగంటకు అతడెంతో ఠీవిగా మా కుటీరానికి వస్తాడు—నాలో మార్పునాశిస్తూ. అతడు రాగానే మల్లెమొగ్గలతో అతని దోసిడి నింపి, అనుకంప సర్దిద్దామని వుంటుంది. కాని నాలోవున్న పిరికిస్వరం పైకి ఉబికి, తరుణగీతం వినిపించడానికి బదులు తర్కంలోకి దింపుతుంది. అతడు నాతో కఠినంగా మాట్లాడలేక కంటికొసలలో జాలి వలలల్లుకొని వెళ్ళిపోతూ వుంటాడు' అన్నది ఇందిర.

'వలచి గెలుచుకొన్న ప్రియుణ్ణి గారవించక తిరస్కరించడం దేనికి ఇందిరా!' అన్నది సులోచన ఆశ్చర్యంగా.

'ప్రేమ గుడ్డిది అంటారు సులోచనా! అలాటిస్థితి నాలో ఏర్పడిందేమోనని ఒక వంక భయం. శేఖర్‌ను సరిగా అర్థం చేసుకోకుండా అతనికి హృదయం అర్పించానేమోనని ఒకవంక సందేహం ... స్త్రీ జీవితంలో ఒక్క తప్పటడుగు...'

'తప్పటడుగు దేనికి? గొప్ప అడుగే వేయవచ్చు. ప్రేమ గుడ్డిదనే పాతపాఠం అప్పచెప్పడం దేనికి!... అలాటి అనుమానం వస్తే ప్రత్యక్షమ్ము లతికించుకొని పరిశీలించాలి.

'నీ సలహా నాకెంతో ఉపకరిస్తుంది సులోచనా' అన్నది ఇందిర ఎంతో సంతోషంతో.

'శేఖర్ గుణం పరిశీలించడమేగా నీకు కావలసింది! ఆ విషయం నాకు వదిలిపెట్టు... అక్కరలేని సంశయాలకు మాత్రం తావు కల్పించక యదేచ్ఛగా హృదయాన్ని ప్రవర్తించనియ్యి' అని ఇందిర ఏపుతట్టి లేవబోయింది మిత్రురాలు. ఇందిర ఆమెను కూర్చోమని సంజ్ఞచేసి—

'అంతా నీదయ. నీమేలు మరువను... శేఖర్ నాకు లభించకపోతే జీవించను సులోచనా' అన్నది ఇందిర.

'వెర్రి ఆలోచనలు పెట్టుకోకు—వేదన పొందుతావు!' అని సులోచన స్నేహితురాలి ముంగురులు సవరించింది.

ఇంతలో గేటు తోసుకొని శేఖర్ లోపల ప్రవేశించాడు. అతడు దగ్గరకు రాగానే స్నేహితురాండ్రిద్దరూ లేచి నిలబడ్డారు. 'ఈమె మా స్నేహితురాలు! సులోచన. నటీమణి' అని శేఖర్‌కి పరిచయం చేసి 'వీరు శేఖర్‌గారు...కాలేజీ లెక్చరర్. కవీశ్వరులు' అంది. వారిద్దరు పరస్పరం అభివందనా లందించుకొన్నారు.

'మీరేదో మాట్లాడుకొంటున్నారు. మా కాలేజీలో పై ఆదివారం సారస్వతోపన్యాసాలున్నాయి. ఇందిరకు యిష్టం గనుక చెప్పి పోదామని వచ్చాను' అన్నాడు శేఖర్.

'తప్పక వస్తాను' అంది ఇందిర ఎంతో సంతోషం ప్రకటిస్తూ...శేఖర్ 'వస్తాను' అని వెనుదిరిగాడు.

'నేనూ వస్తున్నాను...మిమ్మల్ని మా కారులో దింపుతాను' అంది సులోచన.

'మీ కారులోనా! ఎందుకు అంత శ్రమ' అన్నాడు శేఖర్.

'నడుస్తున్నంతసేపూ ఎవరికీ శ్రమవుండదు' అని సులోచన నవ్వి 'వస్తా



ఇందిరా' అంటూ బయలుదేరింది.

కారు వీధి మలుపు తిరిగేవరకూ గేటు వద్ద నిలబడి ఇందిర వెర్రిగా చూసింది. 'శేఖర్‌ను నమ్మలేకుండా వున్నాను. సులోచనను నమ్మవచ్చునా!...స్నేహితురాలు గదా! —ఏమో ఈ ప్రపంచంలో ఎవరిని నమ్మవచ్చో? ఎవరిని నమ్మరాదో? ఇది గ్రహించడం చేతకాకపోవడంవల్లనే చాలా జీవితాలు భగ్నవీణలుగా మారిపోతున్నాయి' అనుకొన్నదామె అక్కడే నిలబడి.

కొద్దిరోజులు గడిచాయి. ఇందిర మనస్సులో సందేహాలు ద్వంద్వరూపం ధరించాయి. ఎడ్వర్టయిజుమెంట్లకు వాడే రంగురంగుల బల్బులు ఒక రకం తర్వాత ఒక రకం ఆరి వెలుగుతున్నట్లు ఆమె హృదయంలో సందేహాలు ఆరి వెలుగుతున్నాయి.

ఆ రోజు సులోచన కారులో ఎక్కి వెళ్ళిన తర్వాత కాలేజి సారస్వతోపన్యాసాల సందర్భంలో కనిపించాడు శేఖర్. 'వచ్చారా?' అని పలకరించాడు గాని, ఆహ్వానాన్ని పురస్కరించుకొన్న ఆదరణ కనిపించలేదు. ఇందిరలో అది కొంచెం అనుమానం కల్పించింది. ఇంతలో శేఖర్ మళ్ళీ దగ్గరకు వచ్చి 'సులోచనగారు వచ్చారా?' అన్నాడు. 'రాలేదు...వస్తానన్నదా?' అన్నది ఇందిర ఆశ్చర్యం ప్రకటిస్తూ. 'అనలేదు' అని అతడు వెళ్ళిపోయాడు. 'నా స్వప్నజగత్తును చేజేతులా సులోచనకు సమర్పించానా?' అనుకొంది ఇందిర.

కవులు, పండితులు సారస్వతం మీద గంభీరమైన ఉపన్యాసాలిస్తున్నారు. ఆమె చెవికి సోకడంలేదు. తల వంచుకొని కూర్చుంది. తను విరహిణిగా మారిపోయినట్లనిపించింది. కళ్ళు చెమ్మగిల్లాయి. కొంగుతో మెల్లగా తుడుచుకొంది.

శేఖర్ తన గేయాలు చదువుతున్నాడు. ప్రణయ జీవనంలోని ఉత్కృష్టతను ఉద్వేగంతో చదివి వినిపిస్తున్నాడు. ఇందిర నేత్రాలు విప్పారినాయి. మనస్సు మళ్ళీ పందిరిగా మారింది. ఇలాంటి భావ సంపదలు గల వ్యక్తి తన జీవిత భాగస్వామి అయితే ఏమి లోపం వుంటుంది? బ్రతుకు పన్నీటి సెలయేరుగా ప్రవహిస్తుంది —అనుకొని ఆనందిస్తోంది.

సభ ముగిసిన తర్వాత శేఖర్‌కు ధన్యవాదా అర్పించాలనుకొంది, అతడు ఎంత

సేపటికి ఇవతలకు రాలేదు. తను యింటికి వెళ్లిపోయింది. అతడు ఇంటికి వెడుతూ ఒకసారి తొంగిచూచి పోతాడని ఆశ పడింది అతడు రాలేదు. 'అలాటి కవిని అనుమానించడమా? ఒకసారి వస్తే సాష్టాంగపడక తప్పదనుకొంది.

ఇష్టం లేకపోయినా మర్నాడు సులోచన ఆహ్వానంమీద ఆమె యింటికి వెళ్లాడు శేఖర్. ఆమెది గొప్ప భవనం. ఎంతో మర్యాద చేసింది. 'మీ కవిత్వం వినాలని కుతూహలంగా వున్నది' అన్నది.

'మొన్నటి సభకు మీరు వస్తారను కొన్నాను' అన్నాడు శేఖర్. 'రాలేదు, ఇందిర వచ్చింది గదా' అన్నదామె.

'ఇందిర వుంటే ఈమె రాకూడదా! ఏమిటి అభిప్రాయం' అనుకొన్నాడు మనస్సులో.

'ఆమె మీ స్నేహితురాలేగా?' అన్నాడు పయటకు.

'నిజమే కాని స్వప్రయోజనాలకూ, స్వార్థాలకూ అడ్డు రానంతవరకే సుమండీ స్నేహాలు! ... లేకపోతే ఎంతో హాని కల్పిస్తాయి. కాలక్షేపానికి స్నేహాలు సంపాదిస్తాంగాని జీవిత నిక్షేపాల్ని గుమ్మరించడానిక్కాదు శేఖర్‌బాబూ' అన్నదామె ఎంతో లాలిత్యాన్ని తొడుచేసుకొని.

'మీరు చెప్పింది నిజమే! కాని ఇందిర అలాంటిది కాదనుకొంటాను' అన్నాడు శేఖర్.

'ఎలాంటిదో ముందుగా తెలుసుకోవడం చాలాకష్టం' అని ద్రాక్షపళ్ల గుత్తి ఒకటి శేఖర్‌చేతికి అందించి 'తీసుకోండి మా స్వల్ప ఆతిథ్యానికి అంగీకరించి వందుకెంతో సంతోషం' అంది సులోచన చిరునవ్వులతో.

'స్వల్ప ఆతిథ్యమంటున్నారా?' అన్నాడు శేఖర్. ద్రాక్షపళ్లు తుంచాడు.

'ఇందిర అలాంటిది కాదన్నారు మీరు. నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నానని తెలిస్తే— మా స్నేహాన్ని పురస్కరించుకొని సహిస్తుందంటారా! చెప్పండి శేఖర్‌బాబు' అని అతని చొక్కాపైనపడ్డ ద్రాక్షతొడిమ చిటికివేసి దులిపింది.

'మీరు నన్ను ప్రేమించడమా! ... అలాటి పరిస్థితి ఎలా ఏర్పడుతుంది?— కలలో తప్ప' అన్నాడు శేఖర్ విచిత్రంగా చూస్తూ.

'కలలో జరిగేవి ఇలలో జరగడం — సాధ్యం కాదంటారా?...ఇందిర గుణగణాల్ని పరిశీలించడం కోసం కాదుగాని, నేను నిజం చెప్పుతున్నాను — మిమ్మల్ని మనసారా ప్రేమిస్తున్నాను. నాటకానికి, నటనకూ గల బాంధవ్యముద్రే మన ఇద్దరి మధ్యా ఎందుకు ఉండకూడదు?' అన్నదామె అతని హృదయాన్ని ఒక్కసారిగా చేరుకోవాలన్నంత ఆశగా చూస్తూ.

'క్షమించండి ... మీరు ఆపాదించదలచినంత ఉత్కృష్టత నాలో లేదు... పైగా నా మనసు!...'

'ఇందిర కిచ్చివేశారా?'

అవునన్నట్లు తల ఊపాడతడు.

'మరి ఆమె హృదయం మీకు అందించిందా! అసలు మీ ప్రేమలోగల ఉత్కృష్టత గ్రహించిందా?

'గ్రహిస్తుందనే నా నమ్మకం'

సులోచన పకపక నవ్వి 'తీసుకోండి, రెండు బిస్కెట్లు తీసుకోండి!' అని కొంచెం ఆగి 'శేఖర్‌బాబూ! మీరు అమాయకులు. కల్పించుకొన్న నమ్మకాలతో జీవితాలను నడుపుకోవడం ఎడార్లలో సెలయేళ్లకోసం వెతకడం' అంది.

అతడు మౌనంగా వున్నాడు. సులోచన కాఫీ కప్పులో పోస్తూ 'నా కోర్కె మన్నించండి: నేను నటిని. మన స్నేహం కళా లక్ష్మికే కానుక అవుతుంది. ఇందిరతో పందెంవేసి వోడి పోవడం దేనికి! సులోచన స్వాగతమిస్తోంది. ఈమె జీవితంలో అడుగు పెట్టండి ... అమరసుఖాలనుభవించండి' అని కప్పుచేతికి అందించింది.

'సులోచనా!' అని అతడు కొంచెం కోపంగా చూశాడు. 'ఒక్క హృదయాన్ని ప్రేమించి గౌరవించే శక్తిమాత్రమే భగవంతుడు నాకు ప్రసాదించాడు. ఆ ప్రేమ విఫలమైనా, సఫలమైనా సంతోషమే! వస్తాను' అని లేచాడు శేఖర్.

'కాఫీ తీసుకువెళ్లండి...తొందర పడకండి'. అతడు కూర్చుని కాఫీ త్రాగుతున్నాడు. ఆమెవెళ్లి అతని వెనుకగా చేతులు కట్టుకొని నిలబడింది. ఇద్దరి ప్రతిబింబాలూ ఎదురుగావున్న అద్దంలో కనిపిస్తున్నాయి.

'ప్రేమ ఆంతరంగిక విషయమనేది నేను గ్రహించక పోవడం లేదు. కాని ప్రేమాస్వరూపం ఇతమిత్థమని ఎవరు నిర్ణయించగలరు? కోరిన హృదయంలో మాత్రమే ప్రేమ వుంది – తక్కిన ప్రపంచమంతా శూన్యమనుకోవడం కేవలం ఆత్మసంకల్పి కోసమే ననే సత్యం మీరు గ్రహించకుండా వున్నారనుకోను. ఒక లతను వికసించిన రెండుపువ్వులు త్రుంచుకోవడం, వెన్నెల రాత్రి వెయ్యికొమ్మలు దులిపినట్లు పూలవర్షం కురియడం ఒకటేనంటారా? మీరు కవులు చెప్పండి శేఖర్‌బాబూ.'

శేఖర్ కాఫీత్రాగి అద్దంలో జంట నీడ కవం చూస్తున్నాడు. సులోచన అక్కడ నుంచే ముందుకువంగి ఖాళీకప్పు అందుకొని కొంచెం పక్కగా పెట్టింది.

'నన్ను ఆలోచించుకోనియ్యి సులోచనా? మళ్లీ కనిపిస్తాను.' అని శేఖర్ లేచాడు.

'మీమీద నాకెంతో విశ్వాసం వుంది' అని అతనిచెయ్యి పట్టుకోబోయింది. అతడు వెనకడుగు వేసి 'మళ్లీ కనిపిస్తాను' అని బయలుదేరాడు. కారులో పంపిస్తాను అంటు ఆమె కూడా వెంట నడిచింది. శేఖర్ మేడమెట్లు అతి విసురుగా దిగాడు. సులోచన ముసిముసి నవ్వులు నవ్వుతూ మెల్లగా దిగింది.

* * *

ఇందిర ఆరోజంతా శేఖర్‌కోసం ఎదురుచూచింది. అతని దర్శనం కాలేదు. సులోచన తన ప్రణయజీవితాన్ని భగ్నం చేసిందనే బాధ మనస్సులో మెలొక్కంది ఇంటిముందు పచ్చని బయలులో కూర్చుని వుంది. ఆరోజు చంద్రగ్రహణం. ఇందిర తల్లి ఇంట్లోకూర్చుని భక్తుల చరిత్ర చదువుతూంది.

ఇందిర చందమామవంక చూస్తోంది. కొంచెంసేపటికి ఆ బింబంలో ఎరుగు కనిపించింది. ఆమె మనస్సు భయంతో బాధతో కొట్టుకొంది. సులోచన ఒక క్రూరసర్పమై తన పవిత్ర ప్రణయ బింబాన్ని కబళిస్తున్నదనే భావం కలిగిం

దామెకు. తల్లి బయటకు వచ్చి గ్రహణం ప్రారంభమైంది అన్నది. ఇందిర మాట్లాడలేదు. తల్లి లోపలికివెళ్లిపోయింది. ఇందిర కన్నీరు చెక్కిళ్లను ముంచెత్తి క్రిందకు వురుకుతున్నాయి. గుండెలు కొండలు మోస్తున్నట్లనిపించింది. లేచి లోపలికి వెళ్లింది. 'వచ్చావా! సతీ సులోచనకథ చదువుతున్నా వింటావా' అంది తల్లి. 'ఎక్కడ సతి! ఎక్కడ సులోచన? నాకేం వద్దమ్మా' అని కేకపెట్టి ఇందిరవెళ్లి మంచంమీద పడుకొంది. 'గ్రహణం వదలగానే లేపుతాను స్నానం చేద్దువుగాని' అంది తల్లి. 'వద్దమ్మా స్నానం చెయ్యలేను... భోజనం చెయ్యలేను. నన్ను లేపకు ఎంతో పుణ్యం వుంటుంది' అన్నది ఇందిర.

దిండు ముఖాన కప్పుకొంది. హృదయాన్ని ఎలా కప్పుకోగలదు? అది రోదిస్తునేవుంది మధ్య మధ్య ఆమె హృదయంతో వాదిస్తూనే వుంది. బ్రతుకులో వలపులు నానా వన్నెల్లు తిరుగుతాయని వింతో సంబరాలు పడింది. చివరకు స్నేహితురాలి మోసంలో పడ్డందుకు బాధపడుతోంది. శేఖర్‌లో కొంత పరాయత్త చిత్తం కనిపిస్తోంది. తన మనస్సును అందీయకుండా అతణ్ణి పరీక్షించినందుకు తగిన ప్రయశ్చిత్తమే జరిగిందనుకొంది. కన్నీళ్లు జలజల రాలినాయి.

వేదనా సముద్రంలో ఈదగా ఈదగా ఎప్పటికో తెల్లవారింది. శేఖర్ పూర్తిగా సులోచనకు దక్కిపోయాడనే ఊహాల్ని ఆమె హృదయంనిండా / చెరిగిపోసింది ఉషసి.

ఆరోజు ఎలా గడిచిందో తెలియదామెకు. స్కూల్లో విద్యార్థులకు అంత అశ్రద్ధగా ఎప్పుడూ చెప్పలేదామె. సాయంత్రమయ్యేసరికి ఆకాశంలోని అరుణారుణ కాంతులు ఆమె కళ్లలోనూ ప్రతిబింబించాయి.

బయటకువచ్చి తోటలో తిరుగుతోంది. తల్లివచ్చి 'గుడికివెళ్లి వస్తా... పొయ్యిమీద పాలున్నాయి. వాటిని కొంచెం దించు' అని వెళ్లి పోయింది. రెండు, మూడు నిముషాలతర్వాత ఇందిర లోపలికి వెళ్లింది. పాలు కాగుతున్నాయి. అక్కడే పచార్లు చేస్తుంది. ఇంతలో 'ఇందిరా!' అన్నపిలుపు వినిపించింది.

ఇందిర ఉలిక్కిపడింది. 'ఎవరు' అంది 'నేనే శేఖరాన్ని' అంటూ అతడు గుమ్మంలోకి వచ్చాడు. ఇందిర హృదయం కోపంతో గడ్డకట్టుకు పోయింది. ఏమీ మాట్లాడలేదు. శేఖర్ లోపలకు వచ్చాడు. 'ఇందిరా ఇవ్వాళ మన భావిజీవితాన్ని గురించి తేల్చుకోవడానికి వచ్చాను. నువ్వు బాగా ఆలోచించి చెప్పు... నన్ను అంగీకరిస్తావా ! ఇదివరకటి అహంకారాన్నే ప్రదర్శిస్తావా?' అన్నాడు.

'ఇదివరకటిదే కాదు ఇంకా ఎక్కువే ప్రదర్శించగలను ప్రేమ వంచనకాదు శేఖర్'—

'వంచన అని ఎవరన్నారు?'

'అనాదిగా అబలల జీవితాన్ని ఆటల క్రిందమార్చి పంచబంగాళం చేస్తూ వస్తున్న పురుషహృదయం చెప్పింది శేఖర్.'

'పురుష హృదయంలో విశ్వాసం లేదంటావా!'

'ఎక్కడో! ఎప్పుడో! సహజంగా చంచలత్వమే ప్రదర్శిస్తుందంటారు. అందం కోసం వెతుకుతూ అందిన హృదయాన్ని దూరం చేసుకొంటుంది. ఒకప్పుడు హృదయంకోసం అన్వేషిస్తూ అందాన్ని వంచిస్తుంది. ఇలాటి నలుగుడులో పడి ఎన్ని స్త్రీ హృదయాలు భగ్నవీణలుగా మారిపోయాయో ఈ జగత్తులో?'

'ఇందిరా నీ నిర్వచనాలకోసం కాదు నే వచ్చింది. నన్ను ప్రేమిస్తున్నావా లేదా! ఈపూట చెప్పివెయ్యి...నన్ను పిచ్చివాణ్ణి చెయ్యకు' అన్నాడతడు కోపాన్ని కొంతవరకు గుండెల్లో కుక్కుకొని.

'నీ ప్రేమను తేలిగ్గా విశ్వసించేంతటి వెర్రిదాన్నికాదు శేఖర్. నీ మనస్సు ఎక్కడుందో తెలుసు' అని ఆమె పొంగిపోతున్న పాలను దించింది.

శేఖర్ మరింత దగ్గరికి వెళ్లాడు. 'నన్ను విశ్వసించడంలేదా నువ్వు ఇందిరా? ఇన్నాళ్లు నీకోసం చేసిన తపస్సు వృథా చేస్తావా! నా హృదయ కుసుమాన్ని నేలకు వేసి రాచి, మరొకరికి రాణి అవుతావా!' అన్నాడు పట్టరాని కోపంతో.

'నన్ను అవమానించకు శేఖర్, నాకూ అభిమానం, ఆత్మగౌరవం వున్నాయని గ్రహించు. దయయుంచి యిక ఎప్పుడూ నన్ను పలకరించకు. నీ మనస్సు ఎక్కడికి లాక్కుపోతే అక్కడికి పరుగులెత్తి పండుగ చేసుకో శేఖర్' అన్నదామె ముఖాన్ని చేతులతో కప్పుకొని దుఃఖిస్తూ!

'మనస్సు లాక్కుపోయిన చోటికా! ఇంత రాక్షసత్వం నీలో వున్నదనుకోలేదు. పవిత్ర ప్రణయాన్ని అర్థం చేసుకోలేని నిర్భాగ్యురాలివి. నే పోతున్నా సుఖంగా బ్రతుకు.' అని ఆమెను త్రోశాడు కోపంతో. ఆమె వెళ్లి తలుపుమీద పడింది. ముఖాన గాయం పడింది. 'అబ్బా' అని అరచేతితో అదు



కాంది. అతడు ఆశ్చర్యంగా చూస్తూ వెళ్ళి పోయాడు.

మర్నాడు సాయంత్రం శేఖర్ ఉత్కంఠతతనే సులోచనయింటికి వెళ్ళాడు. అతని గుండెనిండా వలపు దొంతరలు పేర్చిందామె. ఆమెలోగల సౌందర్యాన్ని రెచ్చగొట్టి, పట్టు వల అల్లిందాతని హృదయాన్ని పట్టడానికి. దగ్గరగావచ్చి 'మీలో నేను కోరినమార్పు కనిపిస్తోం దివ్వాళ శేఖర్‌బాబూ! ప్రణయాన్ని అర్థం చేసుకోండానికి కొంత వ్యవధి అవసరమే, అంతవరకూ వ్యధగానే వుంటుంది. ఆలస్యంగానైనా అవగాహన చేసుకొన్నందుకు ఎంతో సంతోషంగా వుంది.' అని చిరకొంగు మడతపెట్టి చమత్కారంగా తన అరచేతితోవేసి కొట్టు కొంది.

'సులోచనా...' అని అతనేదో చెప్ప బోయి ఆపివేశాడూ.

'ఏమిటి మీరు చెప్పదలిచింది! సులో చన మీదేనని! ఎందుకుకాదు...సులోచనే కాదు...ఈసిరి అంతా మీది. మీరు రాగానే వెయ్యినూట పదహార్లు కానుకగా సమ ర్పిద్దామనుకొన్నాను తీసివుంచాను. తెస్తాను' అని లోపలకు వెళ్ళింది!

'సులోచన నాకు లభిస్తుందా! నా హృదయాన్ని కొనదలుచుకొందా! అసలు సులోచన హృదయాన్ని నే నర్థం చేసు కొన్నానా? ఇందిరమీద కోపం నన్నిక్క డకు ఇన్నిమాట్లు లాగింది. అంతే!... ఇందిర నా ప్రేమను తిరస్కరించిన మాట నిజమే! కాని అంతటిలో ఆమె మీదగల ప్రేమ నాలో నశించిపోతుందా!...

# దోసెడు మల్లె మొగ్గలు

పవిత్ర ప్రేమకు తిరస్కృతి లేదు' అను కొంటున్నాడు శేఖర్. ఇంతలో సులోచన నోట్లకట్టతెచ్చి బల్లమీద పెట్టింది ముసిముసి నవ్వులు నవ్వుతూ.

'ఈరోజు నాకు పండగ శేఖర్ బాబూ! నా మనసూ, తనువూ, ధనం ఒక కవికి కానుకగా సమర్పిస్తున్నాను. ఇందిర దగ్గరేంవుంది. కుటిలత్వం గూడు కట్టుకొన్న వ్యక్తిత్వం తప్ప' అని అతనిచెయ్యి పుచ్చుకోబోయింది.

శేఖర్ లేచి నిలబడి అప్రయత్నంగా 'ఇందిరా?' అని కేకపెట్టాడు.

'ఇంకా మీకు ఇందిరభయం పోలేదా శేఖర్‌బాబూ? చెట్టు పడిపోయిన తర్వాత కూడా ప్రేళ్ళుంటాయి భూమిలో? ఎన్నాళ్ళుంటాయి! కొన్నాళ్ళకు కుళ్ళి పోతాయి. వాటిని గురించిన ఆలోచన వంటిదే ఇందిరపైన మీకుగల ఆలోచన. రండి! కూర్చోండి. నా హృదయాన్ని నెమలిపింఛం చేసి విసురుతాను' అని చెయ్యి అందుకోబోయింది.

శేఖర్ వెనక్కుతగ్గి తిరిగి 'ఇందిరా— ఇందిరా' అంటూ బయలుదేరాడు.

'ఆగండి శేఖర్‌బాబూ! ఈ తరు ణాన్ని పోగొట్టుకోకండి! ఇదుగో సొమ్ము —పాదుషాలగా జీవించండి' అని అందీయ బోయింది. అతడప్పుడే బయటకు వున్న మేడమెట్లమీదకు వెళ్ళాడు. సులోచన మెట్లవద్ద చేతికి అందించింది. అతడు వాటిని వెర్రిగా వెన్నెట్లో విసిరివేశాడు. అవి విలువలేని పిచ్చి కాగితాలలాగా




తోటంతా వెదుకుతూ వెళ్ళాడు.

మళ్ళీ 'ఇందిరా' అని కేక! అతడు మెట్లుదిగి తోటలో అడుగుపెట్టాడు. చెట్టు చాటునవున్న ఇందిరవచ్చి చెయ్యి పట్టుకొంది. శేఖర్ ఆశ్చర్యంగా ఆమె వంక చూశాడు. 'ఇందిరా' అన్నమాట సన్నని ఈలలాగా వినిపించిందాతని పెద వుల నుంచి.

ఆమె శేఖర్ కళ్ళలోకి తొంగిచూచింది. అతడామె ముఖానవున్న కట్టువంక చూశాడు. 'గాయం పడ్డదా ఇందిరా?' అన్నాడు. 'లేదు! నా ప్రేమకు న్యాయం జరిగింది. నన్ను క్షమించండి! నేడాం రండి' అని ఒకఅడుగు ముందుకు వేసింది.

'ఆగండి' అని మెట్లు దిగుతున్న సులోచన కేకవేసింది. ఇద్దరూ ఆగి పోయారు. సులోచన దిగివచ్చి ఇద్దరి వంకా చూచి ముసిముసి నవ్వులు నవ్వుకొంది. ఇద్దరు సిగ్గుతో తల వంచుకొన్నారు.

'ఇందిరా మాతోటలోనూ మల్లెమొగ్గ లున్నాయి. త్వరత్వరగా కోసితెస్తాను ఇక్కడే ఆయన దోసిట్లోపొయ్యి' అని మల్లెపొద దగ్గరకు వెళ్ళింది. ఆప్రేమ మూర్తులు అలాగే నిలబడివున్నారు. సులో చన మొగ్గలుతెచ్చి ఇందిర దోసిట్లో పోసింది. ఆమె సిగ్గుతో శేఖర్ దోసిట పోసింది. ఆమొగ్గలు పకపక లాడినాయి. ఆ తెల్లని వెన్నెల్లో శేఖర్ నేత్రాలు విజయగర్వంతో మెరిసినాయి.

'ఇందిరా! నా నటన ఈ నాటికి ఒక పవిత్ర ప్రయోజనాన్ని సాధించింది. నా కెంతో గర్వంగావుంది. శేఖర్‌బాబూ! మీరు గ్రహించేవుంటారు నా భూమికను. మీ ప్రేమను పరీక్షించాలనుకొన్నాను. మీరు కవులు...నా కెలా సాధ్యమవుతుంది! నాకో ఉపాయం తట్టింది. నేను వేయబోయే నాటకాల్లో సీనులు కొన్నిటిని మీ దగ్గర ప్రదర్శించాను — మీరే హీరోగా భావించి. నా కిదింతా పెట్టి రిహార్సల్‌వంటిదే... మీ ఇద్దరి ప్రణయంలోనా పాత్ర ఒక పవిత్ర అధ్యాయం' అన్నది సులోచన.

'మీ మేలు మరువను' అన్నట్లుగా చూశాడతడు. సులోచన ఇందిర వీపు మీద చిన్నదెబ్బవేసి 'పదండి కారులో పంపుతాను ప్రణయమూర్తుల్లారా' అంటూ వారితో గేటువైపు నడిచింది. ●

# భగవంతుడు ప్రకృతికి అతీతుడు

ధర్మపథం

బులుసు వేంకటరమణయ్య

ధర్మం క్షీణించి, అధర్మం పెరిగిపోయేటప్పుడు—తిరిగి ధర్మాన్ని నిలపడం కోసం భగవంతుడు అవతారాలెత్తుతూ వుంటాడని అందరికీ తెలుసు. ఆ విధంగా అవతరించినప్పుడు మానవ ధర్మాలకు లొంగి వుండడం జరుగుతూ వుంటుంది. సీతాదేవిని రావణుడు అపహరించినప్పుడు శ్రీరాముడు సామాన్య మానవుడి వలె విలపించడం, శ్రీకృష్ణుడు శత్రువుల దాడిని తప్పించుకొనుటకు సముద్రంలో ద్వారకను నిర్మించుకోవలసి వచ్చింది. ఇట్టి సంఘటనలను బట్టి భగవంతుడు కూడా ప్రకృతికి లొంగవలసిందే అనే అభిప్రాయం కలగడం సహజమే! స్థూల దృష్టికి ఇలా గోచరం అవుతుంది. భక్తులయినవారు కూడా కొందరు ఇలా భ్రాంతిపడుతూ వుండడం కానబడుతుంది.

రామకృష్ణ పరమహంస ఆప్త శిష్య వర్గంలో మధురబాబు ఒకడు. ఆయనకు దేవునిగురించి యిలాంటి అభిప్రాయమే వుండేది. ఒకప్పుడు పరమహంసతో సంభాషిస్తున్నప్పుడు ప్రసంగవశాత్తూ 'భగవంతుడు కూడా ప్రకృతికి లొంగి ఉండవలసినదే! ఆయన దానికి అతీతుడు కాడనే తోస్తున్నది' అని తన మనస్సులోని అభిప్రాయాన్ని వెళ్లగక్కాడు. అప్పుడు శ్రీ రామకృష్ణుడు అలా అనుకోవడం పొరపాటనీ, భగవంతుడు ప్రకృతికి అతీతుడనీ, ఆయన ఏమి చెయ్యదలచుకున్నా దానిని చెయ్యగలడనీ, ఆయన విషయంలో వుండే అభిప్రాయాన్ని మార్చుకోవాలనీ మందలించాడు. 'అయితే, భగవంతుడు ఎర్రపూవులు పూచే చెట్టు తెల్లపూవులు పూచేటట్లు చేయగలడా!' అని మధురబాబు ఎదురు ప్రశ్న వేశాడు. పరమహంస, ఆ సమీపంలో వున్న ఒక ఎర్రపూవుల చెట్టును వేలితో చూపిస్తూ 'ఆ భగవంతుడు తలచినట్లయితే యీ ఎర్ర పువ్వులు పూచే చెట్టుకూడా తెల్ల పువ్వులను పూస్తుంది. అందుకు ఏమీ సందేహం లేదు' అని సమాధానం చెప్పాడు. అయినా, ఆ సమాధానం మధురబాబుకు తృప్తిని కలిగించలేదు. కాని ఆయన మౌనాన్ని మాత్రం వహించాడు.

కొన్ని రోజులు జరిగిపోయింది.

ఒకనాడు పరమహంస మధురబాబుతో ఏదో మాటలాడుతూ, నడుస్తూ ఆ ఎర్రపూవుల చెట్టు వుండే వైపునకే వెళ్లాడు. ఆయన మధురబాబుతో 'మధురబాబూ! ఆ యెర్రపువ్వుల చెట్టు తెల్ల పువ్వులను కూడా పూచిందేమో చూడు' అన్నాడు. మధురబాబు దానివైపు చూడగా, ఎర్రపువ్వుల గుత్తుల్లో ఎన్నో తెల్లపువ్వులు కానవచ్చాయి. మధురబాబు ఎంతో ఆశ్చర్యపడ్డాడు.

వెంటనే అతడు తన తప్పును గ్రహించాడు. వెంటనే ఆయన పరమహంసతో 'క్షమించాలని ప్రార్థన. ఇకమీద ఎప్పుడూ ఇట్టి చెడ్డ తలపులను మనస్సులో పెట్టుకోను. భగవంతునిపైన సంపూర్ణ విశ్వాసంతో ఉంటాను' అని వినయంగా అన్నాడు.

భగవంతునిపై మధురబాబుకుండే దురభిప్రాయాన్ని పోగొట్టి విశ్వాసం కలిగించడానికీ, దేవుడు ప్రకృతికి అతీతుడని తెలపడానికీ రామకృష్ణ పరమహంసే ఇట్టి సంఘటన కలిగించాడు.

ఆ తర్వాత మధురబాబు ఎప్పుడూ భగవంతునిపై అవిశ్వాసాన్ని ప్రకటించి వుండలేదు.





# పెద్దల మనసు

వలివేటి నాగచంద్రావతి

క్రిక్కిరిసిన జనంలోనించి ఊపిరి సలపకుండా చేసిన ప్రయాణం ముగిసింది. బస్సు దిగి గుండెల నిండుగా హాయిగా గాలి పీల్చుకున్నది విశాల. అన్నగారు రఘు బస్సు మీదనించి కూలీ అందించే సూటుకేసు రెండు చేతులతోనూ అందుకుంటూ 'నిమ్మదిగా — నిమ్మదిగా' అంటున్నాడు.

తల సరిచేసుకుని, బొట్టు చెరక్కుండా కొంగుతో మొహాన్ని అద్దుకున్నది జాగ్రత్తగా.

దగ్గర కొచ్చిన రిక్షావాడితో బేరమాడుతున్నాడు రఘు, 'రాజాగారి బంగళాకు ఎంతిమ్మంటావోయ్?'

'అరవై పైసలు ఇప్పించండి బాబూ' సూటుకేసు లాక్కున్నంత పని చేస్తున్నాడు వాడు.

'ఎందుకయ్యా నలభై పైసలు.' మొహం చిట్లించి సూట్‌కేసు వెనక్కి గుంజుకున్నాడు రఘు.

'నేను బాబూ సానాదూరం పోవాల. అద్దరూపా యిప్పియ్యండి' బతిమలాడాడు రిక్షా అతను.

జవాబు చెప్పకుండా మరో రిక్షా కోసం కలయ చూశాడు రఘు.

'పోనీ లేరా అన్నయ్యా ఎక్కుదాం' అన్నగారి సమాధానానికి ఎదురు చూడకుండానే రిక్షా ఎక్కి కూచున్నది విశాల. చెల్లెలి తొందరకు విసుక్కుంటూ తప్పనిసరిగా తనూ ఎక్కేశాడు.

ఇంకో సమయంలో అయితే విశాల కూడా గీసి గీసి బేరాలాడ్డంలో అన్నగారిని మించిపొయ్యేదే గాని, ఎప్పుడు ఇంటికి వెళ్లి వాలుదామా అన్న తహ తహలో ఏ కాస్త సమయాన్నీ వ్యర్థం కావడం భరించలేకపోతున్నది.

ఈ బస్సు ఒకటి. వెధవది క్షణ క్షణం ఆగటం, గొర్రెల్ని తోలినట్టు బయటి జనాన్ని లోపలికి తోలడం. గవర్నమెంటు బస్సులొచ్చాక తొక్కిడి తగ్గిందనుకోవటమేగాని తనకేమీ కనిపించలా. 'నా కాలు తొక్కేస్తున్నారం'టూ ఒకరు గోల పెడుతుంటే, 'అలా కుమ్మేస్తావేమిటయ్యా?' అని మరొకరి కంప్లెయింటు. 'జరగండమ్మా—జరగండి. అలా విశాలంగా కూర్చుంటే ఎలాగ? సద్దుకోండి—సద్దుకోండి' మధ్య మధ్య కండక్టరు అదిలింపు. 'నయం...విశాలంట విశాలం... ఒకరిమీద ఒకర్ని ఎక్కిస్తూ. ఇదేమన్నా పుష్పకమా ఎంతమందీ ఎక్కినా మరొకరికి రిజర్వేషను సీటుండటానికి? అయిదు గంటల ప్రయాణం ముగిసేసరికి అర్ధ యుగం గడిచినట్టయింది తనకి.

రిక్షా సందు గొందులన్నీ దాటి సిమెంటు రోడ్డు ఎక్కింది.

రాజాగారి బంగళా ఊరికి కాస్త దూరంగా వుంటుంది. తను వుద్యోగం చేసే తాలూకా ఆఫీసు అక్కడకు దగ్గర కావడం, వూళ్లోని అద్దెల్ని భరించలేక, రాజాగారి బంగళా వెనక 'ఔట్ హౌస్' అద్దెకు తీసుకున్నాడు రఘు.

ఊరికి దూరమైనా కరెంటూ, పంపులాంటి సౌకర్యాలన్నీ ఇక్కడా వున్నాయి.

టౌన్‌లో లభించనిదీ అలజడి లేనిదీ అయిన ప్రశాంత వాతావరణం, చల్లటి గాలి, ప్రాణానికి తెరిపిగా వుంటాయి.

ఇహపోతే ఇక్కడ లేనివీ, టౌన్‌లో వున్నవీ ఏవిటంటే మురికీ, దోమలూ, దుకాణాలూ, సినిమాలూ మొదలైనవి. మొదటి రెండూ అక్కర్లేకపోయినా మూడూ నాలుగూ సౌకర్యాలకోసం అప్పుడప్పుడూ పీలుచేసుకుని వెళ్లక తప్పదు.

రిక్షా బంగళా గేటుముందు ఆగింది. హుషారుగా రిక్షాలోంచి దూకినట్టే దిగింది విశాల. ఒకచేత్తో సూటుకేసు పుచ్చుకుని, మరో చేత్తో జేబులో డబ్బులుతీసి లెక్కపెట్టి, రిక్షావాడి చేతిలో పెట్టాడు రఘు.

'ఇంకో ఐదు పైసలు ఇప్పించండి బాబయ్యా! ఎదరగాలి' ప్రాధేయపడ్డాడు రిక్షావాడు.

'చాలు—చాలు. ఇప్పటికే వో పదిపైసలెక్కువ.' చెల్లెలివంక గుర్రుగా చూశాడు రఘు.

కోటగోడల్లాంటి ఎత్తైన ప్రహరీ. రెండేనుగు లొక్కసారిగా వెళ్లగల పెద్ద ఇనపగేటు. రాజాగారి పూర్వవైభవాన్ని చెప్పక చెబుతున్నాయి. గేటుకు రెండు వైపులా స్తంభాలమీదవున్న రాతి సింహాలు శివిని మూస్తూ కూచున్నాయి.

'పదా—' అన్నగారు తనని దాటుకుని వెడుతూ హెచ్చరించాడు. ఉత్సాహంగా కదిలింది విశాల.

రాజాగారు ఇక్కడ వుండరు కాబట్టి పెద్దగేటు సాధారణంగా తియ్యరు. అది రాజాగారి పిల్లలు వేసవికాలం శలవలు గడిపేందుకు వచ్చినప్పుడో, మరే ఇతర శుభకార్యాలు జరుపుకోటానికి విచ్చేసినప్పుడో పూర్తిగా తెరుస్తారు. మళ్లీ అది వారి నిష్క్రమణతోపాటే మూసుకుపోతుంది. తతిమ్మా రోజుల్లో లోపల ఉన్నవాళ్లకి గేటు మధ్యలో అమర్చివున్న చిన్నగేటే శరణ్యం. చిన్నగేటైనా మరీ ఒంగి నడిచేటంత బుల్లిదేం కాదు. రిక్షా లోపలికి వెళ్లడానికి ఇనపకమ్మీ అడ్డమొస్తుంది కాని సైకిలైతే సునాయాసంగా ఎత్తి లోనికి పోవచ్చు — బైటికి రావచ్చు.

గేటు దాటింతరవాత రాజాగారి మేడదాకా దాదాపు అరఫర్లాంగు దూరమున్న దారి అంతా సిమెంటుతో చప్టా చేసి వుంది. మేడముందు కొన్ని గజాలు ఇవతలగా చక్కటి 'ఫౌన్‌టెన్', 'పెడస్టల్' మీద ప్రణయ లీలలలో మునిగివున్న రాధా మాధవులమీద నిర్విరామంగా పన్నీటి జల్లులు కురిపిస్తోంది.

ఆ జల్లులలో తడుస్తూ కేరింతాలు కొడుతూ ఆడుతున్నారు పిల్లలు.

తెలియకుండానే అడుగులవడి తగ్గింది విశాలకు. మనసు కాస్సేపు చంచలంగా గెంతులేసింది. తాను గూడా ఆ తుంపర్లలో తడవాలనీ, ఆ పిల్లలతో కలిసి పోవాలనే చిలిపి కోర్కెను బలవంతాన అణచుకున్నది.

పెళ్లి అయిన తొలిరోజుల్లో తనూ జయరాం, వెన్నెల రాత్రులు ఆ 'ఫౌన్‌టెన్' గట్టుమీద కూర్చుని ఎన్నో వూసులు, మరెన్నో బాసలు చేసుకుంటూ గంటల్ని క్షణాలుగా దొర్లించడం తలపుకొచ్చి ఒళ్లు పులకరించింది. ఆపుకోలేని మందహాసం బుగ్గల్లోకి గులాబిరంగు గుప్పించింది. అన్నగారు చూడకుండా మొహమటు తిప్పుకుని తనలో తనే మురిసిపోయింది విశాల.

'ఫౌన్‌టెన్'కు ఒక వైపున చీలిన సన్నని కాలిబాట చివరనవున్నది 'ఔట్ హౌస్', బాట కిరువైపులా వాలుగా పాతిన

ఇటుకరాళ్లమీద కొత్తగావేసిన సున్నం తెల్లగా మెరుస్తూంది. వాటివెనక ఒత్తుగా పెరిగిన 'లైన్ తోటకూర' మొక్కలు రాళ్లను కప్పెయ్యాలని చూస్తున్నాయి. కాలిబాట మధ్యన మెత్తని, తెల్లని ఇసుక పాదాల్ని మృదువుగా ముద్దెట్టుకుంటూంది.

'ఔట్‌హౌస్' చుట్టూతా కొంత స్థలం వదిలి ముళ్లతీగలతో అడ్డం కట్టారు. వీధి గుమ్మానికెదురుగా చుట్టూతా వృత్తమున్న తీగల గేటుగూడా అమర్చారు.

అడివిలాంటి ఆ పెద్దతోటలో మూలగా ఆ చిన్నఇల్లు చుట్టూతా పూల మొక్కలతో వంటరిగా, అందంగా, ఒకముని వాటికలా వుంటుంది.

రఘు కుడిచేతిలోని సూట్‌కేసు ఎడమచేతిలోకి మార్చుకుని గేటుకున్న తాడు వూడదీసి వెనక్కు తోశాడు.

గేటు చప్పుడుకు వరండాలోకి రాబోయిన తండ్రి ఒకకాలు మళ్లీ ఇంట్లోకి వేసి. 'ఇదిగో ఏమేవ్ అమ్మాయొచ్చింది' అన్నాడు పెద్దగా. సంతోషంతో ఆయన మొహం విప్పారింది.

చేతిలో పని ఆపుచేసి ఆదరాబదరా బయట కొచ్చేసింది తల్లి. కూతురికి ఎదురువెళ్లి రెండు చేతులా జాపి, 'నాతల్లి— నాతల్లి' అంటూ అక్కున చేర్చుకున్నది.

. అప్పటికి గేటు మళ్లీ బిగించి సూటుకేసుతో వరండాలో కొచ్చాడు రఘు.

'లోపలికి వదండే ఇక్కడేనా?' అన్నాడు చనువుతో కూడిన విసుగుతో ముందలిపోతూ.

అయినా మధురమైన ఆ మమతా బంధంనుంచి జారిపోవాలని విశాలకుగాని, ఆ మమకారపు అనుభూతిని వదలించాలని తల్లికిగాని అనిపించక పోవడాన ఒకరి నొకరు అలా పొదువుకుంటూనే ఇంట్లోకి నడిచారు.

'అమ్మా! చేతుల్నిండా అపిండితో అలా వాటేసుకున్నావేమిటే దాన్ని? చూడు దాని జాకెట్టునిండా ఆ పిండి!' రెండోసారి విసుక్కున్నాడు రఘు.

అప్పటికి ఆ తోటంతో వచ్చింది తల్లి.

# విశాల మనసు

'బిడ్డను చూసేసరికి ఒళ్లు తెలియలేదురా. అయ్యయ్యో జాకెట్టంతా పాడయ్యింది కదా!' నొచ్చుకున్నది తల్లి చేతులు చూచుకుంటూ.

'ఫరవాలేదు లేవే అమ్మా! ఇప్పుడెలానూ స్నానంచేసి బట్టలు మారుస్తానుగా.' సర్దేసింది విశాల.

ఇదే విశాల రెండేళ్ల కిందట వోణికి చిన్నమరకో, జాకెట్టు కాస్త వదులో అయితే, ఎంత హంగామా చేసేదో గుర్తుకొచ్చి నవ్వుకున్నాడు తండ్రి.

గదిలోనించి వదిన సరోజ రెండేళ్ల బుజ్జిగాణ్ణి ఎత్తుకొని చావిట్లోకి వచ్చింది.

'ఏం విశాలా కులాసాయేనా?' అని నవ్వుతూ పలకరించింది.

'ఆ' అంటూ బుజ్జిని చేతుల్లోకి తీసుకోబోయింది విశాల. వాడు ససేమిరా తల్లి చంక వదలక ఏడుపు లంకించుకోడంతో హాదిలేసింది. సరోజ వాణ్ణి బుజ్జగిస్తూ గదిలోకి తీసికెళ్లి పోయింది.

తల్లినలా వంటింట్లోకి, అన్ననిలా గదిలోకీ, వెళ్లనిచ్చి తండ్రి దగ్గరికి చేరింది విశాల. మంచం పట్టీ ఆనుకుని కూచుని, తండ్రి ఒడిలో చేతులు వేసి,

'నీ ఒంట్లో ఎలా వుంటోంది నాన్నా?' అన్నది ఆప్యాయంగా.

అప్పటిదాకా తల్లీ కూతుళ్ల మమకారపు వెల్లువను చూస్తూనే ఆనందిస్తున్న తండ్రి, ఇప్పుడిహ తన ఒంతు వచ్చినట్టయి కూతురి తలపై చెయ్యివేశాడు ఆపేక్షగా. రెండేళ్ల కిందట ఇప్పట్లాగే, గోముగా, 'నన్ను సినిమాకి తీసికెళ్లవా నాన్నా' అని గారాబం కుడిచిన విశాలకీ, రెండేళ్లు కాపురం చేసి వచ్చి ఒళ్లో చేతులేసిన విశాలకీ తేడా కన్పించలేదాయనికి.

'నాకేం తల్లీ బాగానే వున్నా' అంటూ తల నిమిరాడు.

'ఏం బాగో చిక్కిపోయావు. 'షుగరు' ఎక్కువైందటగా! గుండె నెప్పి గూడా వస్తోందని అన్నయ్య చెప్పాడు.' విశాల గొంతులో దిగులు తొంగి చూచింది.

'నా మాటకేం వచ్చెలే గాని నీ అత్తవారింట నీకు సౌకర్యంగా వుంటున్నదా తల్లీ! మీ ఆయన నిన్ను బాగా చూసుకుంటున్నాడా అమ్మా' అని అడిగాడు ఆత్రంగా.

నిజానికి ఆ రెండు ప్రశ్నలూ కాపురానికి మొదటిసారిగా వెళ్లి వచ్చిన కూతుర్ని సహజంగా అయిన వాళ్లు అడిగేవే, కాని నిజానికి ఇప్పుడవి అనవసరమైనవే. ఎందువల్లనంటే—

అత్తవారి ఆదరణకు నిదర్శనంగా ఇక్కడుండగా సన్నగా రివటలా వుండే విశాల పుష్టిగా తయారయింది. శరీరం గూడా రంగు పెంచుకుని కాంతులీనుతున్నది.

తరచూ విశాల రాసిన వుత్తరాలూ, విశాల మొహంలోని సంతృప్తీ ఆమెకు భర్తృ ప్రేమకు కొరతలేదని నిరూపిస్తూనే వున్నాయి.

అయినా ఆయన ఆరాటం ఆయనది.

జవాబు చెప్పక సిగ్గుగా తలవంచుకున్నది విశాల. అదే సమాధానంగా తీసుకుని సంతృప్తిగా నవ్వుకున్నాడు తండ్రి.

కడుక్కున్న చేతులు కొంగుకు తుడుచుకుంటూ తల్లి, స్నానం చేసి బట్టలు మార్చుకుని అన్నగారూ, వచ్చే వేళకు అదే తీరున తండ్రికి ఏవేవో కబుర్లు మెల్లిగా చెబుతోంది విశాల.

నిజమే. తల్లి దగ్గర కంటే తండ్రి దగ్గరే చనువు ఎక్కువ విశాలకు.

తల్లి ఏదో అడగబోతూంటే వారిస్తూ, 'దాన్ని స్నానమన్నా చెయ్యనివ్వండే!' అని వాళ్లన్నా, 'ఇందాకల్లా చిరాకంటూ మొత్తుకున్నదానివి ఎంతకీ లేవవేమే?' అంటూ చెల్లెలినీ కసురుకున్నాడు రఘు.

'అమ్మా నా పెట్టెలో వో ఏరో జాకెట్టూ తెచ్చి పెట్టవే' అంటూ తల్లికి పురమాయించి తువ్వాలు భుజంమీద వేసుకుంటూ విశాల పెరట్లోకి నడిచింది.

తండ్రి మంచం ఎదురుగా పడక కుర్చీలో విశ్రాంతిగా వాలబోతూ, 'దీనికింకా చిన్నతనం వదలలేదే అమ్మా' అన్నాడు రఘు.

బట్టలు తీసుకుని వెళ్లబోతున్న తల్లి ఆగిపోయింది తెల్లబోతూ; వులిక్కిపడ్డాడు తండ్రి.

'ఏమయిందిరా?' ఆత్రంగా వెనక్కి వచ్చింది తల్లి, మంచంమీద నిటారుగా కూర్చున్నాడు తండ్రి.

'అబ్బే మరేం లేదులే.' సావకాశంగా అన్నాడు రఘు.

'మరేవిటిరా?' తండ్రి విసుక్కున్నాడు. చెప్పేది ఆపేసి ఈ నాన్పుడేవిటే అని.

'అహ — పదిరోజుల్లో నూర్పిళ్ళయి పోతాయి, అప్పుడు పంపుతామంటే బావని అని వాళ్ళంటారు. అదే బావా అన్నాడు. అహ అల్లాకాదు ఇప్పుడు, ఎకాఎకీ నా వెంటే రావాలి అని మంకుపట్టుపట్టింది ఇది.'

'అంతే కద' వెనక్కువాలాడు తండ్రి.

తేలిగ్గా నిట్టూర్చింది తల్లి.

'అదికాదే వాళ్ళ పిలూ పొలూ ఇది మాత్రం గమనించవద్దూ? తను ఇప్పుడొచ్చేస్తే పెద్దాయన్ని ఆయాస పెట్టాలి పోస్తుందీ అవటాని బావ అన్నాడని ఆమెమీద 'కోల్డ్ వార్' ప్రకటించి నాతో వచ్చేసింది ఇది' నవ్వుతూగా అన్నాడు రఘు. అతనితోపాటు తండ్రీ నవ్వేశాడు. తల్లిమాత్రం,

'ఎప్పుడొస్తుందో ఏవిటో దీనికి ఏకరం? ఇక్కడైతే ఎంత దాష్టీకం చేసినా మన పిల్లకాబట్టి కడుపులో పెట్టుకున్నాం. వాళ్ళమీదకూడా అధికారం చెలాయిస్తే బాగుంటుందా.' అన్నది విచారంగా.

'పాపం. వాళ్ళుకూడా చాలా మంచి వాళ్ళేనే అమ్మా. ఇది పైపైన తిరుగుతూ కబుర్లు చెబుతూ తలాయిస్తున్నా పిలిచి ఒక్కపని చెప్పదు అత్తగారు. చూశానుగ! 'అమ్మా, విశాలా' అని ఎంత లబ్జుగా పిలుస్తుం దనుకున్నావ్! ఆడపిల్లల్లేని ఇల్లు విశాల వచ్చాక కలకల్లాడు తోందని ఆవిడ ఎంత ముచ్చట పడిపోతోందో...ఇది ఆవిడ్నే అంత దులపరించుకు తిరుగుతుంది. ఇక ఆ మామగారో... దీని అలక ఎక్కడ కనిపెట్టాడో ... 'మువ్వేళ్ళరా పాపం. ఆ అమ్మాయిని చిన్నబుచ్చకు. ఈ సారికి నే నెలాగో అవస్థ పడతాన్లే' అని బావని బయలుదేరదియ్యాలని చూశాడు. 'మీ కిన్నాళ్ళూ ఎలాగూ తప్పలేదు — నే నొచ్చాకగూడానా?' అని బావే మెత్తబడలేదు. ఇక దీనికోపం మాడాలనుకో. అప్పట్నించి బావతో ఒక్క మాట మాట్లాడలేదు. 'పండక్కి రెండు రోజులు ముందుగా తప్పక రా బావా' అని నేనే మాటతీసుకుని వచ్చేశాము.' జరిగిన సమాచారమంతా వివరంగా చెప్పాడు రఘు.

'బాగానే వున్నది' నొచ్చుకున్నది తల్లి.

బట్టలకోసం స్నానం చేస్తున్న విశాల కేక వెయ్యటంతో తల్లి అక్కడ్నించి వెళ్ళిపోయింది.

ఎవరి ఆలోచనల్లో వారు జారుకుని, నిశ్శబ్దంలో పడ్డారు తండ్రీ కొడుకూ.

* * *

రఘు తరవాత ఎడంగా పుట్టిన ఆడపిల్ల కావటాన అల్లారుముద్దుగా, అతి గారాబంగా, ఆడింది ఆటగా — పాడింది పాటగా పెరిగింది విశాల.

విశాల యస్.యస్.యల్.సి. ప్యాసయింది —తండ్రి ఆరోగ్యం చూడబోతే బాగుండలేదు. ఎప్పటికైనా ఆడపిల్లని ఒక అయ్య చేతిలో పెట్టవలసిందే గదా. తన ఘట ముండగానే ఆ మూడు ముళ్ళూ పడితే మంచిదని అనుకూలమైన సంబంధము చూచి విశాలకి చిన్నతనంలోనే పెళ్ళి చేశారు.

ఎగ్రికల్చర్ బి. యస్. సి. మొదటి సంవత్సరం చదువుతున్న ఆనందరావు మొదట్లో చదువు పూర్తికానిదే పెళ్ళేమిటన్నవాడల్లా విశాలను చూశాక తన నిర్ణయం మార్చుకోవటమే కాకుండా, మిగతా రెండు సంవత్సరాల చదువూ విశాలతో కాపురంపెట్టే పూర్తిచేశాడు. [illegible] మేమీ చూసుకోకుండా, తానొక్కడూ ఈదలేకుండా వున్న వ్యవసాయంలో ఆసరాగా వుండమన్న తండ్రి కోరిక ప్రకారం పల్లెకు వచ్చేశాడు ఆనందరావు.

కాని పసితనం వదలని విశాలకు పెద్దవాళ్ళ పొందున ఒద్దికగా మసలడం ఇబ్బందిగా పరిణమించింది. కారణం— భర్తతో ఒంటరిగా సాగించిన కొత్త సంసారం విశాలకు పంచరంగుల కలలా మిగిలిపోయిందే తప్ప బరువూ—బాధ్యతా, కష్టమూ—సుఖమూ తెలుసుకునే అవసరమూ, అవకాశమూ కలగలేదు.

అందుకనే రెండేళ్ళ తల్లీ తండ్రి ఎన్నిసార్లు కబుర్లు పెట్టినా భర్తను వదిలిపెట్టి రావడానికి ఇష్టపడక, కుంటిసాకులు చెప్పి తప్పించుకుంటూ వస్తున్న విశాల ఈసారి అడగంగానే అన్నగారివెంట బయలుదేరుతూ పంజరంనించి విడుదలైన పక్షిలా 'ఫ్రీ' అయ్యింది.

* * *

'కౌసల్యా సుప్రజారామ...' మెల్లిగా చదువుకుంటూ దేవుడి గదిలో దీపం వెలిగించుకుంటున్న తల్లి, చిరపరిచితమయిన మెత్తని పాదాల సవ్వడి విని తల పైకెత్తింది...విశాల! అర్ధనిమీలిత నేత్రాలతో చేతులు జోడించి నిలబడి వుంది. మరుక్షణం కళ్ళు తెరిచి మంగళ సూత్రాలు కళ్ళ కద్దుకుని వెనక్కి



తిరిగింది.

'అప్పుడే లేచా వెందుకమ్మా ఇంకా పూర్తిగా తెల్లవారనేలేదు. పో పోయి పడుకో.' అన్నది తల్లి. నిద్రమత్తు పూర్తిగా వదలని కూతుర్ని అప్యాయంగా చూస్తూ.

'ఊహూ — మెళుకు వొచ్చేసిందే!' పెరట్లోకి నడుస్తూ అన్నది విశాల.

పెరట్లో నూతి గట్టుని ఆనుకుని నిలబడింది విశాల బద్ధకంగా. పొగమంచు తెరసెల్లా నెరకనించీ సుందరంగా తొంగిచూస్తున్న చామంతిమడినీ పన్నజాజి పందిర్నీ పరవశంగా చూసింది విశాల. విడీవిడని పువ్వుల సౌరభాలు కలగాపులగంగా మనసుని మత్తెక్కిస్తున్నాయి. దూరంగా ఒక పక్కగా రాజాగారి మేడ ఇంకా వెలుగుతున్న మెర్క్యురీ లైట్ల వెలుతుర్లో జిగేల్మంటూ తీవిగా, హుందాగా మిడిసిపడుతోంది.

నెమ్మదిగా కాలకృత్యాలు ముగించుకున్నది. తల్లి పూజ యింకా అవనట్లుంది దేవుడి గదిలోంచి ఇంకా శ్లోకాలు వినిపిస్తూనే వున్నాయి.

తిరిగి గదిలోకి వెళ్లబోతూ ఆగింది. రోటి పక్కగా కడిగిన పప్పు కనిపించింది. తండ్రికి ప్రొద్దుటే మినపకుడుము తినటం అలవాటు. కొంగు దోపుకుని రోటి ముందు పీట వాల్చుకున్నది.

రోటి చప్పుడు విని తొంగి చూచింది తల్లి.

'నీకెందులే తల్లీ ఆ మోటుపని — నే వస్తున్నానుగా' అన్నది. కూతురు కష్టపడిపోతుందన్న ఆరాటం కొద్దీ.

'ఫరవాలా! నా కలవాటే' అన్నది విశాల రుబ్బటం ఆపకుండానే.

పూజ మధ్యలో ఆపి రాలేక వూరుకున్నదావిడ. కాని ధ్యాన్నమిక దేవుడి మీద నిలవలేక పోయింది. ఎలాగో తొందరగా ముగించి హారతి ఇచ్చింది. తులసి కోటలో నీళ్లు వడ్డించి, 'ఆదిత్య హృదయం' పఠిస్తూనే వచ్చి రోటి దగ్గర కూలబడింది 'ఇక లేమ్మా లే' అంటూ.

ఆ పాటికి విశాల రుబ్బటం పూర్తి చేసి పిండి గిన్నెలోకి ఎత్తి పెడుతోంది,

## విశాల మనసు

మెత్తగా బొరుసు ఆరని పిండిని చూస్తూ.

'ఎప్పుడు నేర్చుకున్నావే ఇంత పని నేర్పు?' కూతురు పనిమంతురాలయిందని సంబర పడ్డది తల్లి. ఇక్కడుండగా అక్కడి చెంబుతీసి ఇక్కడ పెట్టేదికాదు విశాల.

'మా ఇంట్లోనూ రోజూ ప్రొద్దుటే టిఫిను వుండాలిసిందేగా. ఝాము పొద్దెక్కేదాకా గొడ్లచావిట్లోంచి వూడిపడదు మా అత్తగారు. ఆ దిక్కుమాలిన పల్లెటూళ్లో హోటళ్లు కూడా లేవాయె. మరి తప్పుతుందా నేర్చుకోవటం?' అత్తగారిదే నేరమన్నట్లు నిష్ఠూరంగా మాట్లాడింది విశాల.

'గొడ్ల దగ్గరకు ఆవిడెందుకూ? పాలేర్లు లేరూ?'

'అబ్బె వాళ్లు చేసేపని ఈవిడకు నచ్చదూ! దగ్గరుండి వూడ్చినదే వూడ్పించి, కడిగిందే కడిగిస్తే గాని తృప్తి పడదు. ఆ ఆవూ, గేదెలకీ బాగా అలవాటు చేసిందేమో ఆవిడకు తప్ప మరెవ్వరికీ పాలివ్వవాయె! ఇవన్నీ అయి ఆవిడ వంటింట్లోకి జొరబడే సరికి పొద్దు కరకరలాడుతుంది. ఆ పాటికి నేను పిండి రుబ్బి అక్కడ పెడితే తనప్పుడొచ్చి పొయ్యి ఎక్కిస్తుంది.' విశాల గొంతులో అత్తగారికి సహకరిస్తున్నాననే తృప్తికంటే, అంతవరదాకా ఇంటి పని తన నెత్తిన రుద్ది వూరుకున్నదన్న దుగ్ధే ఎక్కువగా వినిపించింది తల్లికి.

ఆ మాత్రం సాయం చేస్తే తప్పేమిటని తల్లికి అనిపించినా, కూతురి వుద్దేశ్యం అలా లేదని తెలుస్తూనే వుందయ్యె. అందువల్ల మౌనంగా వూరుకున్నది.

జీలకర్రా, మిరియప్పొడీ చల్లి, కమ్మని నెయ్యి ఒత్తుగా రాసిన కుడుము ఒక ప్లేటులోనూ, పొగలు కక్కుతున్న ఇడ్లీలూ, కారప్పొడీ మరో ప్లేటులోనూ సర్ది చావిట్లో పేపరు చూసుకుంటున్న తండ్రికీ, ఆఫీసు కాగితాలు వ్రాసుకుంటున్న అన్నయ్యకీ ఇచ్చి వచ్చింది విశాల. ఇంతలో తల్లి కాఫీ కలిపితే ఎవరిగ్లాసు వారికందించి వచ్చి తానూ వో గ్లాసు అందుకుని పీట వాల్చుకుని కూర్చుంటూ కూరలబుట్ట ముందుకు లాక్కుంది.

కలిసిపోయిన కూరగాయల్ని విడదీసి వేటికవి ఏరి పెడుతూ మధ్య మధ్య కాఫీని రుచి చూస్తూ, 'వదిన ఇంకా లేవనే లేదేం అమ్మా?' అని అడిగింది కొంచెం వింతగా మొహం పెట్టి.

తల్లి సమాధానంగా ఏదో చెప్పబోయి ఆగింది. క్షణంసేపు పనాయించి 'లేస్తుందిలే మెల్లిగా, తొందరేం?' అన్నది ముక్తసరిగా.

'అదేమిటి? వాతే పొద్దుల్లోవున్న నువ్వేనా మరి తూరుపు తెల్లవారకుండా లేచి చాకిరీ చెయ్యాలిసింది?' బలహీనంగా వున్న తల్లి చెంపలకేసి చూస్తూ అసహనంగా కదిలింది విశాల.

'ఆ విచక్షణా జ్ఞానం కూతుళ్లకుంటుందేమోగాని కోడళ్లకెందుకుంటుందమ్మా' అన్నది తల్లి నిట్టూరుస్తూ.

వదినగారు పానుపెక్కి రాజభోగాలు పోతున్నదన్నమాట! తన తల్లేమో వొళ్లు దాచుకోదు. బాగుంది వరస, అనుకుని, మరి ఆమాటలు తర్కించకుండా కూరలు తరగడంలో మునిగిపోయింది.

ఆ రోజంతా సరోజ గదివదిలి బయటకు రానేలేదు, అరుదుగా ఏకాఫీ తాగేందుకో, బుజ్జికి పాలు కలిపేందుకో, వచ్చినా ఇట్టేవచ్చి అట్టే గదిలోకి మళ్లీ వేంచేస్తూ వుండటం విశాల గమనిస్తూనే వున్నది.

తల్లి అపసోపాలు పడుతో అటు తండ్రికి పథ్యపానాలు సమకూరుస్తూ ఇటు అన్నకు ఆఫీసు టయిముకల్లా వంటావార్పూ అమర్చడానికీ సతమతమవుతూకూడా కోడల్ని చెయ్యిసాయానికి పిలవకపోగా, మధ్య మధ్య గదిలోకి తొంగి చూసి 'ఒక్కముద్ద నోటబెట్టుకుని పడుకోవే' అంటూ బ్రతిమలాడ్డం, ఆవిడగారేమో పడుకునున్నది కదలకుండానే మెల్లిగా ఏదో గారాలు కుడుస్తో సమాధానమిస్తుండటం, ఈ సరణి విశాలకేమీ నచ్చలేదు.

తల్లికి చాతనయినట్టు సాయం చేస్తూనే ఎన్నోసార్లు వదినగారి ప్రవర్తన మీద వో 'వ్యాఖ్య' విసరాలనుకోవటం,

కిన వెంటనే ఎందుకో తటపటాయించి తమాయించుకోవటం పాపం విశాల మన స్థితి క్రిందుమీదు లవుతూనే వున్నది నిముష నిముషమూ.

* * *

మరునాడు విశాల లేచేసరికి వంటింట్లోంచి సరోజ గొంతు వినిపిస్తోంది. 'వదినకీవేళ అప్పుడే తెల్లవారిందే?' అనుకున్నది విశాల. అంతకన్న విచిత్రం! 'నిన్నంతా సోమరిగా పడుకున్న మనిషి ఈ విడేనా?' అనిపించేట్టుగా చకచకా ఎవర్నీ వేలుపెట్టనివ్వకుండా చేసుకుపోతూంది సరోజ.

'మీరుండండి అత్తయ్యా! నిన్ననంతా చేసిచేసి నలిగిపోయారు. ఈ వేళన్నా కాస్త విశ్రాంతిగా కూర్చోండి' అంటూ ఎప్పటికప్పుడు వంటింట్లోంచి తరిమేస్తోంది అత్తగార్ని.

కాఫీ గ్లాసులు కడగబోతున్న విశాల చేతుల్లో గ్లాసులు లాక్కుని తనే కడుగుతూ, 'నువ్వు చెయ్యాలిసింది ఇక్కడ కాదు లేవమ్మా విశాలా! మీ అత్తారింట్లో చెయ్యి' అంటూ నవ్వింది.

తెల్లబోయింది విశాల. వదినగారు తన మనసులోకి తొంగిచూడలేదు కదా!

మాట తప్పించి, 'నిన్ననలా పడకేశానేం వదినా?' అన్నది.

'మరే! ఈ మధ్య ఒంట్లో అప్పుడప్పుడూ నలతగా వుంటోందిలే' చిరునవ్వుని పెదవుల మధ్య బిగించి మొహం తిప్పుకుంది.

బుజ్జిగాడికి నీళ్ళుపోసి ఒంటికి పౌడరద్దుతోంది తల్లి.

'ఏమిటో ఏమిటో. బుజ్జికి చెల్లాయో, తమ్ముయ్యో పుట్టబోతున్నారు. ఏరా బుజ్జీ! నీకు తమ్ముడు కావాలా? చెల్లెలు కావాలా?' అంటూ పత్తుగా పౌడరు రాసిన వాడి ఎర్రటి బుగ్గల్ని గట్టిగా ముద్దెట్టుకుంది తల్లి. గిలిగింతలు పెట్టినట్టు గలగలా నవ్వాడు బుజ్జి.

'ఇదా సంగతి' ఆశ్చర్యపోయింది విశాల. వదినని తానెంత అపార్థం చేసుకున్నదీ!

ముందు వరండాలో తల్లి బియ్యం ఏరుతుంటే చేటలో బియ్యాన్ని వేళ్ళతో కదుపుతూ ఆమాటే అన్నది.

'వదిన రోజూ ఇంతే కాబోలు నను కున్నానే అమ్మా నిన్న!'

'లేదమ్మా లేదు. ఒంట్లో బాగుంటే ఒక్కక్షణం ఖాళీగా కూర్చోదు. సరోజ కాపురానికి వచ్చిన కొత్తల్లో నువ్వూ వున్నావుగా! అప్పుడు చెయ్యటమే నేను. ఇప్పుడు నన్నొక పని ముట్టుకోనివ్వదు.'

'దొడ్డబుద్ధమ్మా దానిది! అహర్నిశలూ మా కోసమే తాపత్రయపడి మమ్మల్నింత వాళ్ళని చేశారు మీరు, మీ రుణం తీర్చుకోవాలి అత్తయ్యా! పెద్దతనంలో మీకింత మాత్రం చెయ్యనివ్వండి' అంటుంది.

'ఇంకో ఇంటినించి వచ్చిన పిల్లవు. నువ్వు నాకు రుణపడ్డదేమిటే?' అంటే 'పెంచినవాళ్ళకి సేవచేసే అదృష్టం ఆడపిల్లలకి లేదత్తయ్యా! మీకు నేను చేస్తే మా అమ్మకు మా వదిన చేస్తుందన్న నమ్మకమైనా వుంటుంది అంటుంది.'

అంతగా చదువుకోనిదైనా వదిన ఎంత ఉత్తమురాలు!

మరి కోడల్ని ఇంతగా మెచ్చుకుంటున్న అమ్మ నిన్న నలా ఎందుకు బయటపడ్డట్టు?

నిన్న కోడళ్ళమీద విసిరిన విసురు ఎవరిని వుద్దేశించి విసిరినట్టు? ఎవరిని! ఎవరి నన్నట్టు?

తనలో వుత్పన్నమవుతున్న ప్రశ్నలకు జవాబుకోసం తల్లిమొహం కేసి పరకాయించి చూచింది.

పొరగా తననే పరీక్షించి చూస్తున్న తల్లి కంటి కొనలలో మందహింపులాంటి మెరుపేదో కొంటెగా మిలమిల లాడింది.

విశాలకు తనతప్పు తానే తెలుసుకో గలగాలనే తల్లి వుద్దేశ్యం అవగాహన అయింది. సిగ్గుపడింది, కృతజ్ఞతగా చూచింది.

'చిత్రం! పుట్టింటికి రాగానే పనిలో తనకీ వోర్పూ, నేర్పూ ఎలా అబ్బేయి చెప్మా! అమ్మమాటల్లో ఎంత వాస్తవం ఇమిడివుందీ!'

తనని తాను తరచి చూచుకున్నది విశాల.

తన అత్తగారికి లోబ్లడ్ ప్రషర్. తెల్లవారు జాము నాలుగ్గంటలకు లేచి రాత్రి పదింటివాకా నడ్డి వాల్చేందుకు తీర దావిడకు. ఆవిణ్ణి తల్చుకుని ఎప్పుడైనా 'పాపం' అనన్నా అనుకున్నదా తాను'

ఇప్పుడు తల్లి హైరానా చూస్తున్న కొద్దీ ఆమెమీద జాలితోపాటు వదినగారి పైన కోపమూ పురవరలాడిందే!

తనలో దోషముంచుకుని వదినగారి నెలా ఎంచాలనుకున్నదీ తను? గురివింద పూస సామ్యంగా వుంది వరస!

విశాల లేతమనసు పశ్చాత్తాపంతో పునీతమయింది.

* * *

ఆ రోజు మధ్యాహ్నం భోజనాలయ్యాక తండ్రీ కూతురూ పిచ్చా పాటీలో పడ్డారు.



# విశాల మనసు

ఆవేళ ఆదివారం అవటం మూలాన రఘు కూడా వారి సంభాషణలో పాలుపంచు కున్నాడు. తల్లి సరేసరి. పైపై పనులు, చూసుకుంటూ చాలావరకూ ఖాళీగానే వుంటుందావిడ.

ముందు విశాల కిష్టమైన సినిమాలూ, వాటిల్లో పాటలూ, షూటింగులమీద మొదలైన ముచ్చట్లు — మెల్లిగా పల్లెటూళ్ల సొంపూ సౌందర్యమూ మీదికి నడిచింది.

వున్నట్టుండి తండ్రి అడిగాడు. 'ఏమ్మా మీ ఆయన వ్యవసాయంలో స్థిరపడ్డట్టేనా ?' అని.

విశాల మొహం హఠాత్తుగా ముడుచుకు పోయింది.

'అలాగే అంటున్నారు' అన్నది ముభావంగా తనకు పట్టనట్టు.

'అంత చదువూ చదివి ఆ పొలంలో వ్యవసాయంలో దిగట మేమిటండీ ? దర్జాగా ఏ ఉద్యోగమో చూచుకోక ?' అన్నది తల్లి ఆశ్చర్యంగా, వీపుమీద వుయ్యాల లూగుతున్న మనవణ్ణి ముందుకు లాక్కుంటూ.

తల్లివంక మెచ్చుకోలుగా చూసింది విశాల.

'అలా గనకమ్మా ఈ రోజుల్లో ఎన్ని డిగ్రీలు సంపాదించుకున్నా వుద్యోగాలు అంత తేలిగ్గా దొరకటంలేదు. ఇంతా చేసి బిడుగూ బోదుగూ లేని ఆ వుద్యోగాల్లో బాముకునేదేముంది గనక! ముష్టి మూడు వందల జీతపురాళ్లే కద. అంతకన్న ఎక్కువగానే ఈ వ్యవసాయంలో రాజాగా సంపాదించుకోవచ్చు.' అన్నాడు రఘు.

'నాకు తెలీకడుగుతానూ! అలాగనుకునేటప్పుడు మరి అంత డబ్బుపోసి అన్నేళ్ల చదువు చదవకపోతేనేమిరా ? ముందే తండ్రికి చేదోడు వాదోడుగా వుంటే ఈపాటికా వ్యవసాయప్పనుల లోతుపాతులన్నీ తెలిసివుండేవికా?' అమాయకంగా అనుమానాన్ని వెల్లడించింది తల్లి.

'నీ మొహం ! నీకు తెలియదులే. అల్లుడు చదివింది పొలం పనులకు సంబంధించినదే. అతని విద్య వృధా కాదులే' నవ్వుతూ తండ్రి తెలియ చెప్పాడు.

'బావ కూడా అదే అన్నాడు. తండ్రి కాలంనాటి పాత పద్ధతులకి స్వస్తి చెప్పి, ఈ ఏడు బావ వేయించిన కొత్త మార్పులవల్ల దిగుబడి బాగా అయిందట.'

'నిజమేలే! చదువుకున్న ప్రతివాళ్లూ వుద్యోగాలకి ఎగబడబట్టే ఇప్పుడింత నిరుద్యోగం ప్రబలిపోయింది. కనీసం కొంతమందయినా ఇలా వుద్యోగమే చదువుకు లక్ష్యమనుకోక పల్లెలకు మళ్ల గలిగితే తిండి కరువు తీరుతుంది. అల్లుడు మంచి పనే చేశాడు. అటు చదువూ సార్థకమవుతుంది. ఇటు రాబడీ పెరుగుతుంది' సంతృప్తిగా తల పంకించాడు తండ్రి.

అందరూ తనకు వ్యతిరేకమే; నిట్టూర్చింది విశాల.

'రాబడిమాట నిజమేనేమోగాని ఆ పల్లెటూళ్లో నా పరదానా, పాడా? ఎంత సంపాదిస్తే నేం, అనుభవించే వీలు లేక పోయాక.' విశాల తన అయిష్టానికి మూల కారణం బయట పెట్టింది.

'పిచ్చి పిల్లా! అలాగేం? చేతినిండా కాసులు లేకపోతే సరదాల మధ్యలో కాపురం పెట్టినా ప్రయోజనమేమిటే ? అనుభవించాలనే మనస్తత్వమే వుండాలి గానీ పల్లెటూరనేమిటే ? పట్నవాసమనేమిటే ? ఎక్కడున్నా ఒకటే! హాయిగా పొలంలో పాడి పంట లారగిస్తూ వుండలేక, సిటీల్లో ఇరుకు కొంపల్లో వుంటూ, మురికి గాలి పీలుస్తూ బతకడంలో సుఖమేమిటి? ఏ సినిమాలో కావాలనుకున్నప్పుడు జామ్మని వో నాలుగు రోజులు టౌన్‌లో మకాంవేసి కులాసాగా తిరిగితే పోలా.' తేల్చేశాడు రఘు.

ఆలోచనలో పడింది విశాల. ఆమె మనసులో మామగారు సారిధాన్యమమ్మాక కాశ్మీరు యాత్రకు వెళ్లమన్న విషయం మెదిలి మెత్తబడుతోంది.

* * *

రాజాగారి తోటమాలి రకరకాల పూలు సజ్జనిండా ఇచ్చిపోయాడు.

వదినగారు అన్నీ కలేసి అందంగా మాల కడుతూంటే పువ్వులందిస్తూ ఎదురుగా కూర్చుంది విశాల.

పువ్వుల రంగులు కొట్టొచ్చినట్టు కనబడ్డాయేమో బుజ్జిగాడు గిలక్కాయలొదిలేసి పువ్వులమీద ఎగబడ్డాడు చేతులో నలిపేస్తూ. వాడి పుడుం పట్టు వదిలించలేక విసుగ్గా ఒక్కటి వడ్డించింది సరోజ.

తారాపథాన్నంటిన వాడి రాగం వంటింటి నడవలో ఒత్తులు చేసుకుంటు నాయనమ్మగారికి గజేంద్రుని మొరలా వినిపించి లబలబ లాడుతూ పరిగెత్తు కొచ్చింది.

'వాణ్ణెందుకే అలా బాదుకున్నావ్?' అబ్బ ఈకాలప్పిల్లలకి కొంచెమన్నా వోర్పు లేదమ్మా!' అంటూ విసుక్కుని మనవణ్ణెత్తుకుపోయింది వోదారుస్తూ.

నవ్వుకున్నారు వదినా మరదళ్లిద్దరూ.

'నిజమే విశాలా—అత్తయ్య వోపికకి మెచ్చుకోవాలిసిందే. వాడుచేసే అగానికి ఆవిడ గాబట్టి వోర్చుకుంటున్నారు గాని నేనైతే తట్టుకోలేక పోదును'

నవ్వేసి వూరుకున్నది విశాల.

[ పెరుక — పెద్దవాళ్లుండటం మన



అదృష్టం విశాలా! వారి అనుభవమూ, గుండె నిబ్బరమూ, ఓరిమీ, సహనమూ, మనకు శ్రీరామరక్ష. వారి అండన మనం నిశ్చింతగా బతగ్గలం.'

సరోజ కంఠం మెల్లిగా మెత్తగా సాగిపోతూంటే పాఠాలు ఒంట బట్టించుకున్నది విశాల. మనసు ఒదినగారిపట్ల గౌరవభావంతో నిండింది.

అనుకున్నట్లుగానే పండుగకు రెండు రోజులు ముందుగానే వచ్చేశాడు ఆనందరావు.

'విశా! గుంటూరులో ఎగ్రికల్చరల్ డిమాన్‌స్ట్రేటర్ ఇంటర్‌వ్యూ వచ్చింది. పొలాలన్నీ కౌలు కిచ్చేటట్లు నాన్నని ఒప్పించాను. మా అమ్మా నాన్న పొలంలో ఇల్లు వదిలి మనతోకూడా వచ్చేందుకు ఒప్పుకోడంలేదు. ఏం చేస్తాం! అప్పుడప్పుడూ వచ్చి చూస్తూందాం' అని.

విశాల నొసలు చిట్లించింది. 'వద్దు. ట్రాక్టరుకొని ఈ ఏడాది పొలాలన్నీ స్వంతంగా చేయిస్తానన్నారుగా! మధ్యలో ఈ వుద్యోగ ప్రయత్నమెందుకూ? అయినా ఆ గుంటూరు ఎండల్లో, నీటి ఎద్దడిలో మనం వుండలేం బాబూ, పొలంలోనే హాయి' నిశ్చయంగా అన్నది విశాల.

'అదేం?' ఆశ్చర్యపోయాడు ఆనందరావు.

'అదంతే లెండి.' నవ్వుతూ అన్నది విశాల.

విశాల ముగ్ధ. వయసు మూమ్మరంలో బాధ్యతలకూ, కట్టుబాట్లకూ చికాకు పడ్డమాట నిజం, వాళ్లకు దూరంగా ఎగిరి పోవాలనుకున్న మాట నిజమే. కాని అది తప్పు త్రోవని తెలిశాక పంథా మార్చుకోని మూర్ఖత్వం లేదామెలో.

పండుగ నాలుగురోజులూ వుల్లాసంగా గడిచిపోయాయి.

మరి రెండురోజుల తరవాత పొలానికు వచ్చగా పసుపు పూసుకుని బొట్టెడంత వెంకటగిరి జరీచీర కట్టుకుని బాధ్యత గుర్తించిన స్త్రీగా, ఇల్లాలిగా విశాల భర్త సరసన కీవిగా, హుందాగా నడచి పోతుంటే కళ్లల్లో బాష్పాలు నింపుకుని తృప్తిగా చూస్తూ వుండిపోయారు వదినగారు అత్తగారు, మామగారు, బంధువులు ఇరుగుపొరుగులు తెలియకుండానే తిరిగి వచ్చి ఇండ్లడ్డి. ●

# ఆచరణలో అభ్యుదయం

ఉన్నవ విజయలక్ష్మి



"సాబ్ బులా రహే

తల వంచుకుని క.సె
మురళీ ప్యూన్ మాటలు
పేపరు వెయిట్ పెట్టి లేచి,

*స్వింగ్ డోర్ తెరుచుకుని గదిలో మేనేజరు టేబిలు కెదురుగా మీద అతని దృష్టి పడింది.*

కొత్తగా అప్పాయింట్ చేసి
లోపలికి నడిచి మేనేజర్ని విష్ చేసి,

'పిలిచారట, ఎందుకు?' అన్న

'ఈవిడ మిస్ కళ్యాణి. ఇవాళే జాయిన్ అయారు...ఇతను మిస్టర్ మురళీధరరావు' అంటూ వాళ్ళి ద్దర్నీ పరిచయం చేశాడు మేనేజరు లింగమూర్తి – నమస్కార ప్రతి నమస్కారాలయ్యాయి.

'ఈవిడకి సీటు చూపించి పని అదీ అప్పగించండి.' లింగమూర్తి మురళీతో అని, ఇంక నువ్వెళ్ళి పని చూసుకో అన్నట్లు కళ్యాణి వంక చూశాడు.

'ఓ. కే. సర్.' అని మురళీ,

## కొత్త సీరియల్ ప్రారంభం!



హా హైౖం...'

ఫ్రెండెన్ను చూసుకోలేతున్న
వి, ఉత్తరాల బొత్తిమీద
మేనేజరు గదివేపు నడిచాడు.

లోపలికి అడుగుపెడుతూండగానే ఆ
ఓ కుర్చీలో కూర్చున్న మరో వ్యక్తి

ావిడ ఈవిడే కాబోలు అనుకుంటూ

ట్లు చూశాడు అతని మొహంలోకి.

తరువాత మేనేజరు దగ్గర శలవు తీసుకుని కళ్యాణి ఇవతల హాల్లోకి వచ్చేశారు. తలవంచుకుని ఎవరి పని వాళ్ళు చేసుకుంటున్న వాళ్ళంతా ఒక్క క్షణం పని ఆపి తలలు ఎత్తి ఆ కొత్త వ్యక్తిని చూసి మళ్ళీ తమ పనిలో మునిగి పోయారు.

కళ్యాణికి సీటు చూపించి, 'ఆ డ్రాయరులో నోటుబుక్కు వుంటుంది. మీరు అదీ, పెన్నూ తెచ్చుకుంటే నేను లెటర్సు డిక్టేటు చేస్తాను.' అని చెప్పి తన సీటువేపు నడిచాడు మురళి.

కళ్యాణి పుస్తకం తీసుకు వెళ్లి వృత్తాలు వ్రాసుకుని వచ్చి టైప్ చెయ్యటానికి వుపక్రమించింది.

ఈ రకం వుద్యోగం తనకి కొత్త, అందులో మొదటిరోజు. కళ్యాణికి ఏమిటో బెదురుగా, చేతులు వణుకుతున్నట్టుగా వుంది. 'ఇంత ఖంగారులో తప్పులు వస్తాయేమో, మొదటి రోజే తప్పులు చేస్తే ఏమనుకుంటారో.' అని వో ప్రక్క మంచి కాస్త బెదురుగా వున్నా, 'ఇవాల్టికి కాస్త నిదానంగా పని చేసి టైము ఎక్కువ తీసుకున్నా, ఎక్కడయినా పొరపాటు వచ్చినా సర్దుకుపోయేలాగే వున్నాడు ఈ మురళీధరరావు.' అని తనకి తనే కాస్త ధైర్యం చెప్పుకుంది. మొదటి పరిచయంలోనే అతనంటే వో మంచి అభిప్రాయం ఏర్పరుచుకున్న కళ్యాణి.

లంచ్అవర్‌లో మిగిలినవాళ్లతోకూడ పరిచయం అయింది కళ్యాణికి...అవధాని, వీర్రాజు, నరసింహమూర్తి, రమణమూర్తి, కామేశ్వరరావు, జగన్నాథం, జనార్దనం, కమల, తారా, అందరితో నమస్కార ప్రతి నమస్కారా లయ్యాయి.

మొగవాళ్లు కేంటీన్‌వేపుకి వెళ్లిపోయారు. ఆడవాళ్లు ముగ్గురూ ఆ ప్రక్కనేవున్న వెయిటింగ్ రూములోకి దారితీశారు.

'మీరు ఇదివరకు ఏ ఆఫీసులో పని



చేశారు?' అంది తార తన టిఫిన్ కారియరు మూత తెరుస్తూ.

'ఇదే నా మొదటి వుద్యోగం —అసలు ఇక్కడ ఆడవాళ్లు ఎవరైనా వున్నారో లేదో, తీరా నేను సెలక్టు అయితే నేను ఒక్కదాన్నే అయిపోతానేమో అని కాస్త భయపడుతూనే అప్లై చేశాను. ఇంటర్వ్యూకి వచ్చినప్పుడే తెలిసింది మీ ఇద్దర్నీ గురించి — నాకెంతో ధైర్యం వచ్చింది...' కళ్యాణి ఎలాంటి అరమరికలూ పెట్టుకోకుండా తన భావాలు అలా బైట పెట్టేస్తూంటే—

'నువ్వు ఏ శతాబ్దానికి చెందినదానివి, ఏ యుగంనాటి భావాలునీవి.' అన్నట్లు కాస్తంత నిరసంగా ఆమెవైపు చూస్తూ,

'అలాంటి భయాలు సంకోచాలూ పెట్టుకున్నవాళ్లు వుద్యోగాలకి అసలు పనికిరారు — పదిమంది మొగవాళ్లమధ్య ఒక్క ఆడది పనిచేయాల్సి వస్తేమాత్రం భయం ఎందుకు—ఎవరిడ్యూటీ వాళ్లు చేసుకుపోతే తీరిపోతుంది.' అంది తార.

ఆ అమ్మాయి మాటతీరుకు కళ్యాణి కాస్త చిన్నబుచ్చుకున్నా పైకి మరేమీ అనకుండా ఒక్క నిట్టూర్పు విడిచి వూరుకుంది.

'అహో భయం అని కాదనుకో — వో మనిషికి వో మనిషి సాయం వుంటే కాస్త సరదాగా వుంటుందని ఒక్కరే అయితే ఏమిటో బిక్కుబిక్కుమంటూ వుంటుంది కదా?' అంటూ. ఫ్లాస్కులో కాఫీ వో గ్లాసులో పోసి కళ్యాణి ముందు పెట్టింది కమల.

'అహ—ఎందుకండీ—నేను ఫ్యాన్ కేత తెప్పించుకుంటాను. ఇది మీరు తీసుకోండి' అంది కళ్యాణి మొహమ్మాట పడుతూ.

'మరేం ఫరవాలేదు. నాకూ వుంది—మరోసారి తాగాలనిపిస్తే వుంటుంది కదా అని ఫ్లాస్కునిండా పోసి తెచ్చుకుంటాను రోజూ— తీసుకోండి' అంది కమల బలవంతం చేస్తూ.

'అయితే మీ కింకోసారికేమీమియగలను' అంటూ చిన్నగా నవ్వుతూ గ్లాసు చేతిలోకి తీసుకుంది కళ్యాణి. తను కాఫీ తాగి గ్లాసు కడిగి తెచ్చియిచ్చాక కమలకూడ తాగి, గ్లాసూ, ఫ్లాస్కూ కడిగి తన ప్లాస్టిక్ బ్యాగ్‌లో సర్దుకుంది. అప్పటికి తార భోజనం కూడ అయింది. బాత్ రూమ్‌లోకి వెళ్లి గిన్నెలు వోసారి కడిగేసి కారియరు సర్దేసి వో మూలపెట్టి తన హ్యాండుబాగ్ తెరచి మూడు వక్కపొడి పొట్లాలు తీసి కమలకీ కళ్యాణికీ కూడ చెరోటీ ఇచ్చింది. ముగ్గురూ ఒక్కపొడి నములుతూ కాస్సేపు ఆ ఖబురూ ఈ ఖబురూ చెప్పుకున్నారు. ఆ తరువాత ఎవరిపనిలో వాళ్లు జొరబడిపోయారు. ఐదుగంటల దాకా అలా టైప్‌చేస్తూ కూర్చున్నా కళ్యాణికేమీ విసు గనిపించలేదు—'మొదటిరోజు చాలా తృప్తిగా సరదాగా గడిచిపోయింది-ఆ తార అన్నమాటలకి కాస్త మనస్సు ఒక్కసారి చివుక్కుమన్నా అదేమంత పట్టించుకోవలసింది కాదు. కొంతమంది మాటతీరే అంత. వాళ్లు అనదల్చుకున్నదేదో మొహంమీదే గబుక్కున అనేస్తారు—' అనుకుంటూ ఆఫీసు గేటుదాటి బస్సుస్టాపువేపు అడుగులు వేసింది కల్యాణి.

నెలరోజులు గడిచిపోయాయి.

ఉదయం ఆఫీసులో ఎప్పటిలాగే కళ్యాణికి లెటర్సు డిక్టేటుచేసి, 'ఇదుగో, ఈ హెవీ ఇంజనీరింగువాళ్ల వుత్తరం చాలా అర్జెంటు—ఈ పూట పోస్టులో వెళ్లిపోవాలి—ముందు ఇది టైపుచేసి ఇచ్చే



పెట్టండి.' అన్నాడు మురళీ.

'అలాగే' అనిచెప్పి వెళ్ళి తనసీట్లో కూర్చుంది. టైటరు హెడ్డాడ్జి కార్బను పేపరూ కాపీపేపరూ బొత్తిపెట్టి టైపు రైటరుకి బిగించింది. చూపులు తను వ్రాసుకు వచ్చిన వుత్తరంమీద వున్నాయి. వేళ్ళు టకటకా ఆ మేటరుని టైపు చేస్తున్నాయి. కాని కళ్యాణి ధ్యాసమాత్రం వాటిమీద లేదు—అవాళ ఉదయం లేచిన దగ్గరనుంచీ కళ్యాణిమనస్సు ఎలాగో వుంది. ఏవేవో ఆలోచనలు, జ్ఞాపకాలు అడ్డదిడ్డంగా అల్లుకుపోయి తలంతా బరువెక్కిపోయేలా చేస్తున్నాయి. అలా ఆ ధోరణిలో పడి కొట్టుకుంటూ పరధ్యానగా టైపు చేస్తున్న కళ్యాణి దగ్గరికి ప్యూన్ వచ్చి నిలబడటంతో తల తిప్పి చూసి చిరాగ్గా మొహం ముడుచుకుని, 'నువ్వెందుకొచ్చావ్?' అన్నట్లు చూసింది.

'ఆ. అర్జెంటు వుత్తరం పూర్తయితే ఇమ్మన్నారు.' అన్నాడు యాదగిరి.

కళ్యాణి ఈ సారి తల ఇటు తిప్పి చూసింది.

'ఔను. నేనే పంపించాను. త్వరగా పూర్తిచేసి ఇవ్వండి' అన్నట్లున్నాయి మురళీ చూపులు.

చివరి రెండు లైన్లూ కూడ గబ గబా టైపుచేసి వుత్తరం పూర్తిచేసి కాగితాలు పైకి తీసి యాదగిరి చేతికిచ్చింది. అతను వెళ్ళిపోయాక మరో వుత్తరానికి పేపర్లు బిగిస్తూ యాథాలాపంగానే మురళీ సీటు వంక చూసింది.

ఫక్కుమని రాబోయిన నవ్వుని ఆపుకోటానికి ప్రయత్నిస్తూ అరచెయ్యి నోటికి అడ్డం పెట్టుకుంటున్నాడు మురళీ. కాని అతని కళ్ళల్లో మొహంలో అదోకలాంటి నవ్వు, పసివాళ్ళు అమాయకంగా ఏ తప్పు చేస్తే వాళ్ళని దండించాలనే సంగతి కూడ మరిచిపోయి ముచ్చటగా, వినోదంగా ఆ పనినే చూసి నవ్వుకుంటున్నప్పటి భావాలు అందంగా దోబూచులాడుతున్నాయి.

కళ్యాణి బిత్తరపోతూ లేచి వెళ్ళి 'ఎక్కడయినా పొరపాటు దొర్లిందా.' అని అడిగింది భయపడుతూనే.

మురళీ సమాధానం చెప్పకుండా, ఆ వుత్తరం ఆమెకి కనిపించేలా కొస్త ముందుకి జరిపాడు. అది చూస్తూనే కళ్యాణి వులిక్కిపడింది.

'అసలే పరధ్యానంగా టైపు చేసిన తను దాన్ని ఒకసారి చదవనైనా చదవకుండా, కనీసం దాన్ని చేతిలోకి తీసుకుని చూడనైనా చూడకుండా అలాగే ఇచ్చేసింది హడావిడిగా. ఇప్పుడు చూస్తూంటే ఏముంది? ఉత్తరం నిండా క్వశ్చన్ మార్కులే. దాన్ని చూస్తే ఎవ్వరికైనా నవ్వొస్తుంది—నవ్వే అన్నమాటేమిటి, మూడ్ సరిగ్గా లేకపోతే చిరాకుతో చిందులు తొక్కుతూ ఈ వుత్తరం నా మొహాన్న గిరవాటువేసేవారు మరొకరైతే' అనుకుంది.

'కామా టైప్ చెయ్యాల్సిన దగ్గరంతా మీరు క్వశ్చన్‌మార్కు టైపు చేసేశారు.' అన్నాడు మురళీ ఆమె చేసిన పొరపాటుని తెలియచెప్తున్న ధోరణిలో. అతని మాటల్లో చిరాకు హేళన లాంటి వేమీ లేకుండా యాథాలాపంగా చెప్తున్నట్లే వుంది.

'ఈసారి జాగ్రత్తగా చేసి తీసుకు వస్తా—' సిగ్గుతో చితికిపోతూ వుత్తరం చేతిలోకి తీసుకోబోయింది.

'ఇవాళ మీ ఒంట్లో బాగుండలేనట్లుంది.' వ్యక్తిగతమైన ప్రశ్న రావటంతో తల ఎత్తి చూసి—'అహ. అంత అనారోగ్యం ఏమీ కాదు—కాస్త తల నొప్పిగా వుంది.' అంటూ నసిగేసింది.

'నేను ఇందాక మిమ్మల్ని చూడగానే అనుకున్నాను. ఇప్పటి వుత్తరం చూస్తూంటే ఆ తలనొప్పి అదీ మరీ భరించలేనంతగా వుందేమోననిపిస్తోంది... ఇది నేను టైప్ చేసేస్తాను...' అంటూ అతను కుర్చీలోంచి లేస్తూంటే—

'అబ్బే—ఎందుకూ—నేనే ఈ సారి జాగ్రత్తగా చేసి తీసుకువస్తా.' అంటి కళ్యాణి ఎంతగానో నొచ్చుకుంటూ.

'మరేం ఫరవాలేదు—ఇది అర్జెంటుగా వెళ్ళిపోవాలి. నేను చేసేస్తాను— మిగతా వుత్తరాలన్నీ మీరు నిదానంగా పూర్తి చెయ్యరుగాని...' అంటూనే కళ్యాణి సీటులోకి వెళ్ళి కూర్చున్నాడు. ఆమెకి మరో మాట మాట్లాడటానికి అవకాశం ఇవ్వకుండా—

అతను టైపురైటరుకి కాగితం బిగిస్తూంటే, తప్పు చేసినదానిలా బిడియంగా ముడుచుకుపోతూ ప్రక్కనేవున్న మరో కుర్చీలో కూర్చుంది.

'అంతసేపు అతని సీటుదగ్గర బాతాఖానీ వేసుకున్నారు. ఇంక ఇప్పుడు ఈయన గారు ఆవిడ పని చేసి పెడుతున్నాడు. చూశావా ఈ వింత.' అన్నట్లు తార కన్ను గిలికింది కమలకేసి చూస్తూ.

సరిగ్గా అలాంటి భావన్నే వ్యక్తం చేస్తూ రమణమూర్తి కామేశ్వరరావుని చూసి చిన్నగా నవ్వాడు.

హాలుకి అటు ప్రక్కగావున్న సీటులో వుండే అవధానికి రమణమూర్తి సౌంజ్ఞలు చెయ్యటం వో వంకర నవ్వు విసరటం కనిపించింది కాని అసలు విషయం అర్థం కాలేదు. అందుకే పని గట్టుకుని లేచి వచ్చి రమణమూర్తి చెవిలో గుసగుసలు ఆడి అసలు సంగతి తెలుసుకుని ఆ దృశ్యాన్ని వోసారి కళ్ళారా చూసి తల ఆడించుకుంటూ తన సీటులోకి వెళ్ళిపోయి—

'అమ్మగారు అప్పుడే అలిసిపోయారులా వుంది. అయ్యగారు సాయం చేస్తున్నారు' అంటూ జగన్నాథం చెవి కొరికాడు విషయం అంతా చెప్పి—

'పోనీలే ఇప్పుడు నీకేమిటి బాధ.' అన్నాడు జగన్నాథం విసుగ్గా కనుబొమలు చిట్లిస్తూ. అవధాని నోరు మూసుకున్నాడు.

తార వెకిలి నవ్వూ, దీని అర్థం ఏమిటో నీకు తెలుసా అన్నట్లు కళ్ళు తిప్పటం అదీ చూస్తే కమలకి ఒళ్ళు మండింది—

'ఆమె కివాళ తలనొప్పో, నెల్సు నొప్పో వచ్చి వుంటుంది. అతను పనిలో కాస్త సాయం చేయబోయాడు. ఈ మాత్రం దానికి ఏదో విడ్డూరం జరిగి పోయినట్లు ఇదవటం ఎందుకూ? అయినా నువ్వు విస్తుపోవటంలో ఆశ్చర్యం లేదులే —నువ్వు ఉద్యోగంలో చేరిన కొత్తలో ఆ మురళీధరరావుతో అవసరం వున్నా లేకపోయినా ఏదో కల్పించుకుని మాట్లాడాలనీ, అతని దృష్టిని నీవేపుకు ఆకర్షించుకోవాలనీ ఎంత తాపత్రయ పడ

లేదు?—కాని 'ఈ ఆఫీసులో తార అనే ఒక వ్యక్తి వుంది అనే గుర్తింపయినా లేనట్లు అతను వుండిపోవటంతో చివరికి నిరాశ చేసుకున్నారు. ఇప్పుడు ఈ కళ్యాణిని చూస్తుంటే నీలో అసూయ తల ఎత్తుతోంది. నిజం చెప్పాలంటే ఆ రావుగారిని నీ ప్రక్కన వూహించుకోవాలంటేనే నా మనస్సు ఎదురు తిరుగుతుంది. కాకి ముక్కుకి దొండపండులా వుంటుంది మీ కాంబినేషన్ — ఎందుక్కా కళ్యాణి అయితే...' యథేచ్ఛగా సాగిపోతున్న ఆలోచనలకి నవ్వుకుని నిండుగా వాళ్ళకి అలాంటి అభిప్రాయం వుందో లేదో కాని ఆఫీసులో మాత్రం కాస్తం అలజడి బయలుదేరింది అనుకుంది కమల—

మిగిలిన స్టాఫ్ మొహంలో ముద్ర వేసుకున్న క్వశ్చన్‌మార్కులు కరిగి పోకుండానే, మురళీ ఉత్తరం పూర్తిచేసి కాగితాలు చేతిలోకి తీసుకుని లేచి నిలబడ్డాడు. కళ్యాణి లేచి 'చివరికి, మీకు శ్రమ ఇచ్చాను...థాంక్స్.' అంది మెల్లగా.

మురళీ సమాధానం చెప్పలేదు. అతి సున్నితంగా, పెదవులు విడీ విడనట్లు ఒక్కసారి నవ్వి వూరుకున్నాడు. త్రుటి కాలం అతని మొహంలోను పెదవుల మీద తొణికిసలాడిన ఆ చిరునవ్వులో 'ఫరవా లేదు, శ్రమ ఏముంది?' అన్న భావం ఒక్కటే కాదు మరేదో అభిమానం అంతకు మించిన ఆత్మీయత స్పష్టం అవుతున్నాయి.

కళ్యాణి గుండెలు ఒక్కసారి ఎలాగో కొట్టుకున్నాయి. తల ఎత్తి సూటిగా అతని మొహం వంక చూస్తే అతను తన మనస్సులోని అలజడినీ తనకే అర్థం కాని బెదురునీ ఎక్కడ గ్రహించేస్తాడో అన్నట్లు తలవంచుకుని పేపర్స్ అటూ ఇటూ సర్దుతూ వుండిపోయింది.

'సరే—ఆ మిగిలిన వుత్తరాలు మీరు చెయ్యగలిగితే చెయ్యండి. లేకపోతే ఒంట్లో బాగుండలేదని మేనేజరుకి చెప్పి ఇంటికి వెళ్ళిపొండి — రేపు వచ్చాక చూసుకో వచ్చు.' అని అతను వెళ్ళబోతుంటే,

'ఫరవాలేదు, చేయగలిగినంతవరకూ చేస్తాను' అంటూ టైప్‌రైటరు ముందు కూర్చుంది కళ్యాణి.

*   *

'హా! ఆదివారం సాయంకాలం షికారు కని బయలుదేరిన మురళీకి కాస్సేపు పార్కులో కూర్చుని రావాలని బుద్ధిపుట్టి అటువేపుకి దారి తీశాడు. పార్కు గేటు తెరుచుకుని లోపలికి నడుస్తూ యథాలాపంగా పరిసరాలని పరికిస్తున్న అతని కళ్ళు కాస్త దూరంగా, అటు తిరిగి కూర్చున్న అమ్మాయి దగ్గర ఆగి పోయాయి. 'అరే—కళ్యాణిలా వుంది.' అనిపించి గుండెలు ఒక్కసారి ఎలాగో కొట్టుకున్నాయి. తను కావాలని కోరుకున్నదేదో ఇలా హఠాత్తుగా ఎదురయితే ఆ సంతోషంలో ఏం చెయ్యాలో తోచక తికమక పడిపోయినట్లు, ఇలా వెళ్ళి ఒంటరిగా కూర్చున్న ఆ అమ్మాయిని పలకరిస్తే ఆమె ఏమైనా అనుకుంటుందేమో అని జంకుతున్నట్లు ఒక క్షణం పాదాలు ఆగిపోయాయి. 'అసలింతకీ ఆమె కళ్యాణేనా? అని.' అన్న వూహ వచ్చి చిన్నగా నవ్వుకుని మళ్ళీ నడక సాగించాడు.

సందేహం లేదు — కళ్యాణే — అలాంటి చీర తను మొన్న ఆఫీసుకి కట్టుకు వచ్చింది - తెల్లటి వెడల్పైన వీపు మీద పరుచుకున్న బారెడు జడ — తుమ్మెద రెక్కల్లా నిగనిగలాడుతున్న నొక్కు నొక్కుల జుట్టు...' దగ్గర పడుతున్న కొద్దీ కళ్యాణే అని నిర్ధారణ చేసుకుంటూ 'ఏమని పలకరించాలి? ఆఫీసులో అవసరం మేరకు ఆఫీసు విషయాలు తప్ప మరో విషయం మాట్లాడుకోని తమ మధ్య సంభాషణ ఏ ధోరణిలో సాగుతుంది.' అని వూహలు అల్లుకుంటున్నాడు.

అతను ఇంకా నాలుగడుగుల దూరంలో వుండగానే ఆ అమ్మాయి లేచి నిలబడి చీర కొంగు సర్దుకుని, కుచ్చెళ్ళు సవరిజేసుకుంటోంది.

'అరే! వెళ్ళిపోతుందేమో — పిలిస్తే బాగుండదు.' అనుకుని, ఆ నాలుగడుగులూ ఒక్క అంగలో దాటినంత హడావిడిగా నడిచి దగ్గరికి వెళ్ళాడు.

వెళ్ళిపోబోతున్న ఆమె తన ప్రక్కగా ఎవరో నిలబడినట్లయి తలతిప్పి చూసింది. ఎదురుగా మురళీ—ఆమె కళ్యాణే.

క్షణంలో సగం సేపు, ఇద్దరికీ ఏం మాట్లాడాలో తోచలేదు. ఆ తరువాత, 'మీరా.' అని కళ్యాణి, 'మిమ్మల్ని



తాళలేనంత గుర్తుపెట్టాను — అప్పుడే వెళ్ళిపోతున్నారేం?' అని మురళీ ఒక్కసారే పలకరించుకున్నారు.

'నేను వచ్చి చాలాసేపే అయింది — నేను వచ్చేసరికి ఒక్కమనిషికూడ ఈ చుట్టుపట్ల లేరు' అక్కడక్కడా గుంపులు గుంపులుగా చేరి ఖబుర్లు చెప్పుకుంటున్న పెద్దలనీ, జట్లు జట్లుగా ఆటలాడుకుంటున్న పిల్లలనీ కలయజూస్తూ అంది కళ్యాణి.

'భలేవారే — అయితే ఎవ్వరూ లేనప్పుడు వస్తే, నలుగురూ వచ్చేసరికి వెళ్ళిపోవాలంటారా?' అంతటితో వదిలిపెట్టకుండా సంభాషణ సాగిస్తూ అన్నాడు.

'అహ — అదేంకాదు — నేను వచ్చి చాలాసేపయిందని...' నసిగేసింది కళ్యాణి.

'మీ వుద్దేశ్యం అది కాకపోవచ్చును కాని, మీరు చెప్పింది వినగానే మాత్రం నాకో సంగతి గుర్తువచ్చింది.' మాట్లాడటానికి టాపిక్ దొరికిందికదా అన్న వుత్సాహంతో చొరవగా అన్నాడు.

'ఏమిటది?' అన్నట్లు ఆసక్తిగా చూసింది కళ్యాణి.

'ఇలా ఎంతసేపు నిలబడి మాట్లాడు

# ఆచరణలో...

కుంటాం? అలా కూర్చోండి — ఇక మరి మర్యాదగా వుండదని అతనికి కాస్త దూరంలో తనూ కూర్చుని 'ఇంక ఇప్పుడు చెప్పండి.' అన్నట్లు చూసింది.

'అబ్బే, పెద్ద విశేషం ఏం కాదు కాని మా బాలాంబ పిన్ని చదువుసంగతి గుర్తువచ్చింది — మా పిన్ని అంటే మా అమ్మ చిన్నాన్నకూతురు. తల్లితండ్రులకి ఒక్కతే. మా చిన్న తాతగారు జిల్లా కలెక్టరుగా రిటైరయారు లెండి...లేక లేక కలిగిన ఒక్కగాను ఒక్కబిడ్డ — తండ్రి పెద్ద హోదాలో వున్నాడు, చేతినిండ నౌకర్లు, ఇంటినిండా బంట్రోతులు. మా పిన్నికి కావలసినంత గారం జరుగుతూండేది — ఆవిడ కా అంటే కా, కీ అంటే కీ, ఆవిడ గుర్రాన్ని చూసి గాడిద అంటే అంతా అలా అనాల్సిందే అన్నంత అపురూపంగా పెరిగింది — ఇంట్లో తల్లి తండ్రులనీ, నౌకర్లనీ అలా తన ఇష్టం వచ్చినట్లు ఆడించే పిన్ని బయటి ప్రపంచంలో మాత్రం చాలా పిరికిగా భయస్తురాలిగా వుండేది — తన మానాన తను ఏవో బొమ్మలూ అవీ పెట్టుకుని ఒక్కతీ




ఇంట్లో ఆడుకోవటమే కాని, పదిమంది స్నేహితురాళ్ళని పోగేసుకోటం అందరి ఇళ్ళకీ వెళ్ళటం అదీ వుండేది కాదు — చదువుకూడ మేష్టరే ఇంటికివచ్చి చెప్తూండేవాడు కూతురు స్కూలుకి వెళ్ళి చదువుకోవాలనీ, నలుగురితో కలిసిమెలిసి తిరగాలనీ మా తాతగారికి కోరికగా వుండేదిట — అందుచేత ఏలాగో మంచి మాటలు చెప్పి, బతిమాలుకొని చివరికి స్కూల్లో జేరటానికి ఆవిడ్ని ఒప్పించారుట. అయితే మాపిన్ని వూరికే ఒప్పుకోలేదు, వో షరతుకూడ పెట్టింది...'

'ఏమిటది?' అన్నట్లు కళ్ళు ఎత్తి చూసింది కళ్యాణి. 'తను స్కూలుకి ఒక్కతీ వెళ్ళలేదు — రోజూ తనతోకూడా బంట్రోతు రావాల్సిందే — తనని స్కూల్లో దిగవిడిచాక వాడు ఇంటికి తిరిగివచ్చి మళ్ళీ స్కూలు విడిచిపెట్టే వేళ్టికి స్కూలుకి వస్తాడో, లేకపోతే తను స్కూల్లో వున్నంతసేపూ వాడు ఆకాంపౌండులోనే ఏ చెట్టుక్రిందో కూర్చుంటాడో అదంతా తనకి అనవసరం. తను క్లాసులోంచి బయటికి రాగానేమాత్రం వాడు వరండాలో హాజరుగా వుండి తనని వెంటపెట్టుకుని యింటికి తీసుకురావాలి, అందిట. ఆ సంగతి నువ్వు వేరే అడగాలా? నిన్ను ఒక్కదాన్ని మేం మాత్రం పంపిస్తామా? అప్పలస్వామి రోజూ నిన్ను స్కూలుకి తీసుకువెళ్ళి మళ్ళీ తీసుకువస్తాడు — అన్నారుట అమ్మమ్మా తాతగారూ — సరే — వో మంచి రోజున, వో గుమస్తా, వో బంట్రోతూ పిన్నిని తీసుకువెళ్ళి స్కూల్లో జేర్పించటం, ఆవాళ్టికి పుస్తకాలేమీ లేవనే కారణంతో మళ్ళీ వెంటనే యింటికి వచ్చేయటంతో ఆవిడ స్కూలు జీవితంలో మొదటిరోజు గడిచిపోయింది — ఆ సాయంకాలం సరికి పుస్తకాలు వచ్చాయి — ముచ్చటయిన బొమ్మలతో చక్కగా వున్న ఆ కొత్త పుస్తకాలకి అంతకన్నా ముచ్చటయిన రంగు రంగుల అట్టలువేసి పెట్టారు జవాన్లు — వాటిమీద గుండ్రటి అక్షరాలతో పొందికగా పిన్నిపేరు వ్రాసిపెట్టారు తాతగారు — ఆ మర్నాడు బాగా త్వరగా తయారయి స్కూలుకి ప్రయాణం

అయింది పిన్ని — ఫరవాలేదు అమ్మాయి దారిలో పడుతోంది అని మురిసిపోయారు తాతగారూ వాళ్ళూ — పిన్ని, అవిడ ప్రక్కన పుస్తకాలసంచీ పట్టుకుని అప్పలస్వామి ఇద్దరూ బయలుదేరారు. పదిబారల దూరంలో వున్న స్కూలుకి వీళ్ళు చేరుకునేసరికి అక్కడ ఒక్క పిట్టకూడా కనిపించలేదు — లోపల ఎక్కడో స్కూలు జవాను గదులూ అవీ తుడిచి శుభ్రం చేస్తున్న అలికిడి విని పిస్తోంది. 'మేమంతా చెప్పాం కదండమ్మాయిగారూ. ఇంకా చాలా వేళ వుంది.' అన్నాడు అప్పలస్వామి చేతులు నలుపుకుంటూ. 'ఫరవాలేదు, కూర్చుంటాను.' అని గర్ల్స్ వెయిటింగు రూమ్‌లో వో బల్లమీద కూర్చుంది. క్రమంగా అబ్బాయిలూ అమ్మాయిలూ రావటం మొదలుపెట్టారు. స్కూలు బెల్లు మ్రోగింది. పిన్ని వరండాలోకి వచ్చి అప్పలస్వామికి పుస్తకాల సంచీ అందించి 'ఇంటికి వెళ్ళిపోదాం అంది...'

రాబోతున్న నవ్వుని ఆపుకుని, 'బాగుంది. నేను వెళ్ళిపోతాను అని చెప్పినదానికి ఎంత కథ చెప్పారు?' అంది కళ్యాణి.

'నయమే ఇది కథ అనుకుంటున్నారా? కథకాదు నిజంగా జరిగింది — నాలుగో క్లాసులో స్కూల్లో జేరిన మా పిన్ని ఆ పద్ధతిలో నాలుగు రోజులు స్కూలుకి వెళ్ళి వచ్చింది. తరువాత మరి స్కూలు మొహం చూడలేదు. ఇంట్లోనే ఏదో చెప్పించారనుకోండి. తరువాత పెళ్ళి అయిపోయింది—అవిడ పిల్లలు ఇప్పుడు బియ్యేలు ఎమ్మేలు చదువుతున్నారు—సందర్భం వచ్చినప్పుడు మాత్రం మేమంతా ఆనాటి సంగతులు చెప్పుకుని నవ్వుకుంటాం — అంటే, అసలు ఈ విషయం మాకు మా అమ్మ చెప్పింది, మేమంతా నమ్మాం మరి, మీకు నమ్మబుద్ధి కావటం లేదా?'_ ఇంత పెద్ద విషయాన్ని అంత సరదాగా చెప్పటంలో కొత్తదనం పోయి చనువుగా అడిగాడు.

'మీరు చెప్తున్నారు కాబట్టి నమ్మతాను.' అంది కళ్యాణి.

'అంటే? నేను అబద్ధం చెప్పనని మీకు నమ్మకమా? ఏమిటి నాలో ఆ ప్రత్యేకత?'—కళ్యాణి కళ్ళల్లో ఏవేవో భావాలకోసం వెతుక్కుంటున్న వాడిలా ఆశగా, మృదువుగా ఆమె మొహంలోకి చూశాడు.

తను యథాలాపంగానే అన్న మాటలో తనకి తెలియకుండానే ఏదో ఆత్మీయత ఇమిడివుందా, ఏదో దగ్గరితనం వ్యక్తం అయిందా, అనే ఆలోచన వచ్చి కలవరపడిపోయినట్లయింది కళ్యాణి. అయితే అదేమీ పైకి వ్యక్తం కానివ్వకుండా—

'మీ ఇల్లెక్కడ?' అంది మాట మారుస్తూ.

'ఇల్లా? బ్రహ్మచారిగాడు వుండేదాన్ని ఇల్లని ఏమంటారు [illegible], ఏదో వో గది, ఉండటానికి సౌకర్యంగానే వుంది గాని, ఆఫీసుకి బోలెడు దూరం—విద్యానగర్‌లో వుంటున్నాను.'

'అయితే ఇక్కడికి దూరమే.'

'దూరమే మరి—మీరు వుండేదెక్కడ?'

'రవీంద్రభారతికి అటు ప్రక్కగా వున్న వీధిలో.'

'అరె—చాలా దగ్గర. రోజూ ఈవెనింగ్ వాక్‌లా రావచ్చు మీరీ గార్డెన్‌కి.'

'ఆ. రోజూ ఎక్కడ కుదురుతుంది—ఎప్పుడైనా వస్తుంటాను...మరి ఇంక వెళ్తాను.' అంటూ లేచింది కళ్యాణి.

'నేనూ వెళ్ళిపోతాను. ఏమీ తోచక ఇలా వచ్చాను. అనుకోకుండా మీరు కనిపించారు. ఏవేవో మాట్లాడుతూంటే టైమ్ తెలియకుండానే గడిచిపోయింది.' అంటూ మురళీ కూడా లేచాడు.

(ఇంకా ఉంది)

---

కూరలూ గుణాలూ:

## ములుదోసకాయ

ములుదోసకాయ దలవ చేస్తుంది, మూత్రం బాగా జారీ అయ్యేటట్లు చేస్తుంది. పొత్తి కడుపును శుభ్రపరుస్తుంది. రక్తపైత్యం, పైత్యం, దాహం, తాపం వీనిని తగ్గిస్తుంది. మూత్రకృచ్ఛము గలవారికిది మేలు చేస్తుంది.

గురుత్వం చేస్తుంది. జీర్ణశక్తిని మందగింపజేస్తుంది. వాతం చేస్తుంది. జలుబు చేస్తుంది.

దీని దుర్గుణాలకు విరుగుళ్లు: 1. ఓమము 2. ఉప్పు 3. మిరియాలు.

ములుదోసవిత్తుల చూర్ణం దలవ చేస్తుంది. నీరుడు గావిస్తుంది. నీరుడయేటప్పుడు కలిగే మంటను ఉపశమింపజేస్తుంది. వాత శరీరులకు జబ్బు చేస్తుంది. దీనికి విరుగుడు సోపు.

సేకరణ:- ఆకుండి నారాయణమూర్తి




ప్రాతఃకాలం ఐదు గంటలవుతుంది

సుమారు ఒకటవ నంబరు 'పుష్పకం' విజయవాడ లక్ష్మీటాకీసు సెంటరునుండి 'బయలుదేరనా, వద్దా?' అన్నట్టు 'గుర్రు బుర్రు' మంటూ పెద్దగ యిష్టం లేనట్లు వింత వింత సంగీత ధ్వనుల్ని వెళ్ళగక్కుతూంది. విజయవాడ పౌరాగ్రేసరు లందరూ అక్కడి సిటీబస్సులను ముద్దు ముద్దుగ 'పుష్పకమ'ని పిలిచి సంతృప్తితో నిట్టూరుస్తుంటారు తమ చక్కని పోలికకు.

అలనాటి రావణ 'పుష్పకం'లో ఖాళీ అంటూ లేకపోవడం లేదట. అక్కడి సిటీ బస్సులుగూడ 'సేవ్‌డిజైన్'. ఇంకో సారూప్యంకూడ ఉంది. 'డిజైన్' లోపం

వల్ల, అసలు 'పుష్పకం' లాగా అవి ఆకాశయానానికి నోచుకోలేదు. కాని అంతమాత్రంచేత వచ్చిన నష్టం ఏమీ లేదు. ఆ లోపాన్ని చోదక శిఖామణులు అతి నేర్పుగ పరిష్కరించేశారు. తమ నిపుణతతో బస్సులను గాలిలోనే నడుపుతూ ప్రజల మన్ననల నందుకుంటూంటారు. అప్పుడప్పుడూ ధూపనైవేద్య సహితంగా పూజలుకూడ అందుకుంటూంటారు.

ఇలా డ్రైవరోత్తములు గాలిలోనే నడపడానికి ఒక ముఖ్య కారణముంది. అక్కడి మున్సిపాలిటీవారు ఒక విలక్షణమైన రోడ్లను ఆ ఊరికి ప్రత్యేకంగా 'డిజైన్' చేయించారు, అన్ని ఊళ్లలాగే సాఫీగా తిన్నగా రోడ్డుంటే తమ ప్రత్యేకత దెబ్బ తింటుందని. అటువంటి రోడ్ల 'మీద' నడిచే వాహనాలు గుర్రపుస్వారీని అనుసరిస్తున్నట్లు చూచేవారికే, ఎక్కిన వారికీ అనిపిస్తుంది. ఎక్కిన ప్రయాణికులు ప్రయాణం చేస్తున్నంతసేపూ రకరకాల విన్యాసాలు చేస్తూనే ఉంటారు. డ్రైవర్లు ఈ యాతనను తొలగించే ఉద్దేశ్యంతోనే వాయుచోదనం ప్రారంభించారన్నమాట.

యింకా కండక్టరు పానకాలు అయిపూ అజా లేదు. డ్రైవరు మస్తాన్ తన సీట్లో కూర్చుని చిరాకుగా పానకాలు రాకకై ఎదురు చూస్తున్నాడు. మాటి మాటికీ 'యాక్సిలరేటరు' నొక్కి ఇంజన్నెంతో రొంతన పెడుతున్నాడు. స్వాతంత్ర్యోద్యమాన్ని కళ్లారా జూసిన 'ఫోర్డు' అది. ఇంకా సంఘ సేవ చేస్తూనే ఉంది. తుది శ్వాస వరకూ చేస్తుంది కూడా! తప్పదు మరి!

క్లీనరు సూర్యోదయం, బీడీ వెలిగించి, తను కూడ చిరాకు పడుతున్నట్లు, 'ఏంటశ! యింత లేటు. రోజూ యిట్టాగే ఉందీయన యవ్వారం! ఇయ్యాల కలెక్సను సున్నే! మూడూ ముప్పెయ్యారు యెల్లిందనుకుంటానే! యేవియ్యా మస్తానో?' అన్నాడు.

డ్రైవరు లేనపుడు కండక్టరు దగ్గిరా కండక్టరు లేపుడు డ్రైవరు దగ్గిరా రెండోవాళ్ల మీద తనూ విసుక్కొని వాళ్లను ప్రసన్నుల్ని చేసుకుంటాడు సూర్యోదయం!

'చరే గానీ మస్తానూ! వో పావలా యియ్యవయా కాఫీ తాగొస్తాగాని!' అంటూ గునిశాడు.

అంతలో పానకాలు దుర్గా కేఫ్ రోడ్డులో నుంచి వస్తూ మస్తాను కంట బడ్డాడు. 'అడుగో దొరగారు. ఆడొస్తుండాడనుకొంటే నువ్వు దూస్కుంటావ్రా, సూరిగా?' రొండో ట్రిప్పులో తాగుదువు గానిలే!' అంటూ 'క్లచ్ వదిలాడు. ఒక్కసారిగా కుదిపి ముందుకు దూకింది పుష్పకం. ఎగిరి అందులో ఎక్కేశాడు పానకాలు. ఆ యెగరడంలో భుజానున్న తోలు సంచిలోంచి అర్ధరూపాయి క్రింద బడింది. 'గుంటకాడి నక్క' లాగా యెదురు చూస్తున్న సూర్యోదయం దాన్నొక్క గంతులో అందుకుని, 'కాఫీ తాగొస్తానయా, పానకాలూ' అంటూ అప్పుడే స్పీడందుకున్న బస్సు లోంచి నేర్పుగా దూకేశాడు.

'ఆ! అరిరీ; సూర్యోదయంగా! నీకు బుద్ధి రాదురా, నిన్ను పగలగొయ్యా!' అనుకుంటూ బస్సులో ఉన్న నలుగురు ప్రయాణికులకూ టిక్కెట్లు చించాడు పానకాలు. మొదటి ట్రిప్పు అవడం మూలాన జనం లేరు. మొదటి రెండు ట్రిప్పులూ కలెక్షను తక్కువే? తరువాత మూడూ నాలుగు ట్రిప్పుల్నించీ అంథుకుంటుంది. కాలేజీ పిల్లలూ, ఆఫీసుకు వెళ్లేవారూ, పల్లెటూళ్ల నుంచి పట్నానికి వచ్చేవాళ్లూ మొ. వారందరితో చాల హడావుడిగ ఉంటుంది పానకాలుకూ, సూరికీ!

పది గంటలకు మూడో ట్రిప్పులో గొల్లపూడి నుండి నిండుగ బయలుదేరింది పుష్పకం! సూర్యోదయం ఫుట్‌బోర్డు మీద అలవోకగ నిలబడి యెంపో విలాసం ఒలకబోస్తూ రాత్రి రెండోఆట చూసిన సినిమాలోని భంగిమలను అనుకరించడానికి పాట్లు పడుతున్నాడు.

ఇంతలో అతని అనుభావులకు అంతరాయంగా మస్తాను హారను ఒకటే మోతగ కొట్టసాగాడు. సూర్యోదయం ఫుట్‌బోర్డురాడ్ ఒకచేత్తో పట్టుకుని బాగా వంగి ముందుకు చూశాడు. దూరాన ఒక ముసలమ్మ రోడ్డుమధ్యలో వంగొని పేడ యెత్తుతున్నది తట్టలోకి. హారను వినబడినా దగ్గర కొచ్చేదాకా నిర్లక్ష్యంగా తనపనిలో మునిగిపోయింది. సూర్యోదయానికి మండిపోయింది. 'అసలే లేటయిందని యేడుస్తుంటే ఈ [illegible]కళ్లు 'అడ్డు! నియ్యవ ఒక్కగుద్దు గుద్దిండంటె పచ్చడవుతావు' అనుకున్నాడు ముసలిదాన్ని దాటుతూండగా.

'ఏం తల్లీ యింటో అందరికీ చెప్పే వొచ్చావా' అన్నాడు. యింతలో చెక్‌పోస్టు చేరింది బసు.

'ఆ! చెక్‌పోస్టొచ్చిన్నారా బాబో ఎవరన్నా హోల్డాయిన్!' అనరిచాడు గొంతు చించుకుని. 'లేవి రావాలె తొందరగా, ఎవురిది దయ్యా ఈ గంప? ఆ? దోవలో అడ్డంగా! నువ్వు రా తల్లీ, రామ్మా దిగావా? మా తల్లే! రాయిక్ష్!' అంటూ మస్తానుకు సిగ్నలిచ్చాడు.

'పానకాలో మూడు దినాలే!' అన్నాడు దిగినవాళ్లకు జవత్వాన్ని అపాదిస్తూ!

'ఒకసారి ఒకటే యెచ్చు. అక్కడ మొగుడు కాచుక్కూర్చున్నాడు. ఒకటెక్కెనైనా, యాభైరూపాయలు క్షవరం!' అంటూ ఆ భాషలోనే హెచ్చరించాడు పానకాలు. బరాజా దగ్గర చెకింగ్ ఇన్‌స్పెక్టరు తనిఖీ చేస్తున్న సంగతి తెలియజేశాడు.

యింతలో పకీరుగూడెం వచ్చింది, పానకాలు,

'పకీరుగూడెం హోల్డాన్' అనరిచాడు. సూర్యోదయానికి చిర్రెత్తుకొచ్చింది. 'ఏంటయా పానకాలూ ఎప్పుడూ పకీరుగూడెం అంటావు? ఎన్నిసార్లు చెప్పాలయా నీకు? ఆ? మర్యాదంగ 'పకీరు నగర్' అనలేవంటయా' అంటూ స్వాభిమానాన్ని ప్రకటించుకున్నాడు. ఎన్నాళ్టినుంచో అతను అందరికీ చెప్తూనే ఉన్నాడీ సంగతి! అయినా మానాలే! అతను తప్ప ఆదరించేవాళ్లు కనబడలేదు. దానికంత సెంతో చింతిస్తుంటాడు. అందరిలాగా తమపేటకూ సుందరమైన పేరుండాలని సూర్యోదయానికి వాళ్ల బావ యేసుపాదం [illegible]!

తరువాత బస్సు [illegible] వద్దని వారించినా, వో నలుగురు మోటు మనుష్యులు ముందుప్రక్క వ్రేలాడసాగారు. సర్కస్ ఫీట్లు చేస్తూ.

# పుష్పక విమానం

'ఒరేయ్ మూర్తీ, ఆ ముద్దుర్ని పై స్టేపులో దింపేసెయ్. తెలుసుగా. పైన చెకింగుంది.' అన్నాడు పానకాలు.

కానీ ఆ స్టాపుకంటె ముందుగానే వాళ్ల పాలిటి యమధర్మరాజు చెకింగు యిన్స్పెక్టరు రూపంలో దున్నపోతులాంటి తన 'ఎన్‌ఫీల్డు' మీద బస్సు ఆపమని చెయ్యి వూపుకుంటూ వచ్చాడు.

మస్తాన్ బ్రేకు వేస్తూ, హెచ్చరిస్తున్నట్లుగా, 'పానకాలూ' అని తమాషాగా పిలిచాడు. బస్సు ఆగింది. యిన్స్పెక్టరు వెనకనుంచి లోనికెళ్ళాడు. పానకాలు ఆయన వెనకే ఉన్నాడు. వెనక్కి తిరిగి బిత్తర ముఖంతో ఉన్న సూర్యోదయానికి సౌంజ్ఞ చేశాడేదో!

వెంటనే సూర్యోదయం బస్సు ముందు డోరు దగ్గరకు పరుగెత్తాడు. అక్కడ సీట్లు చేసిన నలుగురు మనుష్యుల్లో ఒకడు, 'ఎందుకయ్యా, ఆపేసినారూ? ఆరు ఏవటూ? ఓ్రమగరా యేంది?' అనడిగాడు. సూర్యోదయానికి మండింది.

'కొవరు కాదయా. మా మొగుడు. తెల్సిందా? ఏం టట్టా చూస్తున్నావ్ నా మొహంలోకి? కోతులేమైనా ఆడుతున్నాయా? దిగవయా ముందు. నువ్వు కూడ వయోవ్! ఎక్కడికీ లోపలికి దూరతన్నావ్ మెల్లగా? దిగి, ఆ ముందుకెళ్ళి ఆగండి. తరవాతెక్కుదురు గాని!' అన్నాడు. వాళ్ళు దిగిపోయారు. చెకింగు యిన్స్పెక్టరిదంతా చూడలేదు. లెక్క ఖచ్చితంగా ఉంది.

'హు! హూ! కరెక్టు.' అని నిట్టూర్చాడు. గురి తప్పిన వేటగాడిలా!

బస్సు బయలుదేరింది. ముందు దిగిన నలుగురూ కాస్త దూరంగా ఆగారు. దగ్గరకు రాంగానే, 'ఆపండి. ఆపండి' అనరిచారు. సూర్యోదయం, 'ఏంటీ? మిమ్మల్ని మళ్లీనా? పొరేలే యిక చిప్పే మాకు. పోండియా నడిచి.' అంటూ కసిరాడు.

మార్కెట్టు దగ్గర దిగవలసిన వాళ్ళు ఉండడంతో ఆ ప్రక్కనే ఆపాడు మస్తాన్. ఇంతలో,

'ఎవరయ్యా కండక్టరు? ఇక్కడ ఆపకూడదని తెలీదూ? బస్సు నెంబరెంత? ఆ? ముందిటు రా బసుదిగి!' అంటూ కానిస్టేబిలొకడు కవ్వింపు చర్యలతో కొల్పులు జరిపాడు. పానకాలు క్రిందికి దిగకుండానే, 'మీరా సార్! యిదిగో తీసుకోండి మీ సిగరెట్ పెట్టె. యిందాక ట్రిప్పులో తీసుకున్నాగ!' అని వో పెట్టె అందించాడు. అర్థం పర్థంలేని ఈ ప్రశ్నలూ, సమాధానాలు అంతుబట్టని ప్రయాణీకులు వినుపోతూ ఉండగానే కానిస్టేబిలు అవతలికెళ్ళి పెట్టెతెరిచి అందులో ఉన్న రెండు రూపాయల నోటు ఎవ్వరికంటా బడకుండా జేబులో దోపేశాడు.

'ఇదిగో పానకాలూ! యివ్వాళ పెద్దయ్యారి పెట్రోలింగు ఉందిగానీ యిక్కడ ఆపబోకు. పైన ఆపుకో! మరి నే వస్తా. చిన్నయ్యగా రబ్బాయిని డాక్టరుగారింటికి తీసుకెళ్ళాలి.'

ఇంతలో కూరగాయ లమ్మేసుకుని ఖాళీ గంపలతో స్త్రీలు రాసాగారు మార్కెట్టునుంచి. పానకాలొక్కసారిగా వాళ్ళను హడల గొట్టేశాడు.

'ఏమిటి! ఈ గంపలన్నీ బసులోకేనా? అమ్మో! యిదేమన్నా బస్సా, గూడ్సా! దిగండి, దిగండి,' అన్నాడు.

'బాబ్బాబు, ఎండెక్కి పోతావుంది; మావాయనగా! కావాలంటే, వో పది పైసలుచ్చుకో అయ్యా ఎగస్ట్రా' అంటూ బ్రతిమాలేదాకా వాళ్ళను దిగమంటూనే ఉనాడు పానకాలు. గంపకు పదిపైసల చొప్పున వసూలు చేశాడు.

'ఆ! ఎవరండీ టికేట్, ఇదేమిటయ్యా ఇరవైయిచ్చావ్ సెంటరుకు ఇరవైరెండు! ఇంకో రెండు పైసలివ్వు. ఏంటీ లేవా? ఐదుందా! యిటివ్వు! మూడుపైసలు దిగేటప్పుడు తీసుకో! జరుగు ముందుకు! ఊఁ! తొందరగ' అంటూ హడావుడిగా డీల్ చేశాడో పల్లెకారు మనిషిని.

చలువ కళ్ళజోడు లోంచి ఇతరుల కనుమానం రాకుండా వో నవయువతిని తాగేస్తున్నట్లు చూస్తున్న వో నవయువకు డిచ్చిన పదిపైసలు తీసుకొని 'రెండుపైసలే నువ్సార్! తరవాతడగండి' అంటూ సాగిపోయాడు' ఎనిమిదిపైసల టికెట్టిచ్చి. ఇంతలో రైల్వేస్టేషను వచ్చింది. జనం బిలబిల దిగుతున్నారు.

'మూర్తీ, టికెట్లుచూడు' అన్నాడు పానకాలు. కొందరు టికెట్లు కొనకుండా తప్పించుకొని దిగిపోతారటు వంటి బద మలో! మొత్తానికి ఇద్దరు దొరికారు.






'ఏవయ్యా మాకు చెంగెద్దామనే? నాయం ఉండాలయా!' అంటూ వాళ్ళిచ్చిన పావలాబిళ్ల జేబులో వేసుకున్నాడు సూరి, పానకాలు తన్ను గమనించడం లేదని రూఢి చేసుకుంటానికి బస్సులోకి చూశాడు. అతను బిజీగా టిక్కెట్లు కోస్తున్నాడు.

బస్సు బయలుదేరింది. గాంధీనగరం మలుపు తిరగడంలో ఒక రిక్షావాడికి చావుదప్పి కన్ను లొట్టబోయింది.

'ఏం బాబో! బొందితోసహా యెళ్లిపోతావ్ కైలాసం! మాబండి కింద బడితే' అంటూ పరామర్శించాడు సూరి.

లక్ష్మీటాకీసు మలుపు తిరిగింది. జైహింద్ టాకీసు దాటింది ఇంతలో,

'యూవండోయ్! అందరూ గట్టిగా పట్టుకోండి!' అని సూరి గావుకేక వినిపించింది. అది ముగిసిందో లేదో 'ముసలి ఫోర్డు' వో చిన్నసైజు హైజంపు చేసింది. లోని జనమంతా రకరకాలుగ ఊగుతూ, లాంగుజంపులూ, హైజంపులూ మొ విన్యాసాలు చేశారు. యువతుల ప్రక్కనే విల్చున్న యువకులు మహాప్రసాదం అనుకుని యెంతో సంతుష్టి చెందారా తోపులాటలో! విజయవాడలో రోడ్లను అడ్డంగా త్రవ్వడం పరిపాటే! ఆ తరువాత రోడ్డుకు సమమట్టంగా పూడ్చక పోవడమున్నూ అలవాటే! మస్తానెపుడూ జాగ్రత్తగానే ఉండేవాడక్కడ! కానీ మనస్సు బాగోక యివ్వాళ కాస్త పరధ్యానంగా ఉండడంతో బస్సంతా సర్కస్ చేయవలసొచ్చింది.

బస్సు బందరురోడ్డుమీద పోతూంది. పశువులాస్పత్రి దాటాక సూర్యోదయం వెనక్కుతిరిగి చూశాడు యాదాలాపంగా. ఇంకేముందీ! మూడజా ముప్పయ్యారు శరవేగంతో దూసుకొచ్చేస్తూంది. యింకేం లేదు దాటేస్తుంది.

'మస్తానో లాగిచ్చవయా! మూడజా ముప్పియారొచ్చేసిందక! నియ్యవ! చాతగానోళ్లంతా డ్రైవర్లెందు కవుతారయ్యా, పావీ!' అనరిచాడు.

దీనితో బసంతా ఒక్కసారి జలదరించి, గభుక్కున స్పీడందుకుని పోసాగింది వెనకబస్సుకు సైడివ్వకుండా!

మొగల్ రాజపురం దగ్గిర ఆగింది వోల్డు ఫోర్డు! సూర్యోదయం తెగ ఖంగారుపడి

# పుష్పక విమానం

పోతున్నాడు.

'ఏవమ్మోయ్! రామ్మా మాతల్లి! అంత నయ్యారవైతే యలా?'

'అయ్యో! ఉండబ్బాయ్! యేవిటలా ఖంగారు పెట్టేస్తావూ? దిగాలా మరే వన్నావా' అందా గజలక్ష్మి!

'ఇదిగో అట్టా మాటలు చెపితే లాభంలా! అవతల మూడూ ముప్పియ్యారొచ్చేస్తాంది. ఇదిగో రైట్ చెప్పేస్తున్నా! ర్ ... ర్' అంటూ బెదిరించాడు.

'ఒచ్చే, ఒచ్చే ఉండయ్యా!' వీడెక్కడ రైట్ అంటాడోనని అని ఆవిడ ఖంగారుగ రాబోవడంతో ఎవరిక్రిందో ఇరుక్కుపోయిన ఆవిడ హవాయి చెప్పుకూ ఆవిడకూ ఋణం తీరిపోయింది. దాంతో ఆవిడ మరింత ఖంగారుపడిపోయింది.

'ఖర్మమ్మా తల్లీ ఖర్మ! నీ చెప్పుకో దణ్ణం! నీకో దణ్ణం! దిగు తల్లీ!' అంటూ ఆ చెప్పును వంగి తనే తీసి బయటికి కిటికీగుండా విసిరేశాడు.

'నాయనా! కండక్టేరూ నా పైసా యిచ్చేస్తావూ' అంది యింకో ఆండాళమ్మ.

'నా చెప్పు! నా చెప్పు! పీడ జిమ్మడ! ఒకటే ఖంగారు!' అంది గజలక్ష్మమ్మ!

వీళ్లందరికీ సమాధానంగా 'రాయిక్ష' అన్నాడు పెద్దగా సూర్యోదయం! అయితే అప్పటికే తరుణం మించిపోయింది. మూడజా ముప్ఫయ్యారు క్రొత్త లేలేండు. క్షణంలో ఫోర్డును దాటేసి గాలిలో తేలి పోసాగింది. కానీ, దాని డ్రైవరు సింహాద్రి దాటిపోతూండగా నవ్విన హేళననవ్వు మస్తాను మగతనానికో మచ్చలాగ కనిపించింది. ఫలితంగా అతనికాలు యాక్సిలరేటరును అడుగంటా తొక్కింది.

పోలీసాఫీసు దగ్గర ఆగిన లేలేండును వోల్డు ఫోర్డు దాటుతూండగా దాంట్లోని జనమంతా ప్రక్కన విమానమేదన్నా కూలిపోతున్న దేమోనని ఖంగారుగా తలలు వంచి చూశారు. మస్తాను విజయగర్వంతో సింహాద్రికి చేయూపాడు. సూర్యోదయం బిగ్గరగ ఈల వేశాడు నోట్లో వ్రేలు పెట్టి.

వోల్డు ఫోర్డిట్లా బరితెగించి పోతూండగా చుట్టుప్రక్కల యిళ్లల్లోంచి జనం బయటికొచ్చి తలలు పైకెత్తి ఆకాశంలో వెదక సాగారు. కానీ అక్కడేమీ కనబడక క్రిందజూచి 'హోహో వోల్డ్ ఫోర్డా!' అనుకుని మళ్లీ యిళ్లల్లోకి వెళ్లిపోయారు. వో ముసలాయన యిదంతా తెలియక, తన చంకలోని గొడుగు గబగబ తెరిచి వేసుకుని, 'ఉరుముతూంది. వర్షమొస్తుందో ఏం పాడో!' అన్నాడు. కానీ క్షణంలో తన్ను దాటిపోయిన బస్సును జూసి 'వోరినీ బస్సుమోతా!' అనుకుంటూ గొడుగు మూసేశాడు.

వోల్డు ఫోర్డు పటమట సెంటరులో ఆగి రొప్పసాగింది దాహమయినట్లు. సూర్యోదయం దాని మనస్సెరిగి ఛెంగున దూకి, హోటల్లోదూరి, డబ్బాతో నీళ్ళు తెచ్చి యింజను గొంతులో పోశాడు. పోస్తూ, 'అడికి సైడియ్యమాక! ఇస్తే మన కందదు! యిట్టాగే లాగిచ్చు మస్తానో!' అన్నాడు.

మొత్తానికి పోరంకి పోస్టు చేరింది ముందు. సూర్యోదయం సూచన అక్షరాల

---

ఇది మీకు తెలుసా!

## పండ్లు

పండ్లు రకరకాలు వాడాలి.

పండ్లు కోసి కాకుండా ఏకంగా తినాలి. తాజావి తినాలి. పండుతోపాటు దాని తొక్క కొంచెం తినాలి.

పండ్లకి ఎప్పుడూ ఉప్పు చక్కెర చేర్చకూడదు.

ప్రతి భోజనం చివరా ఏదో ఒక పండు తినాలి.

పండ్లు చెట్టుని పండనివ్వాలి.

దేశవాళీ పండు ఫలాలు శ్రేష్టం.

—కె. రా.

---

అమలు చేశాడు మస్తాను మేరి. బస్సొగ గానే పానకాలు హోటల్లోదూరి తెగిన టిక్కెట్లకు సరిపోనూ డబ్బు వేరుగ తీసి మిగతాది జేబులో పెట్టుకున్నాడు. ఇంకో క్షణం ఆలోచించి, ఇంకో ఇరవై తీసి జేబులో పెట్టుకున్నాడు. కలెక్షను అందివ్వడానికి మేనేజరుగారింటికి బయలు దేరాడు. ఆయన ఎదురు చూస్తూనే ఉన్నాడు రోజూలాగానే డబ్బు లెక్కజూసుకొని,

'ఏమిరా! కలెక్షను తగ్గిందే, ఎంత పంచుకున్నార్రా అంతా కూడ బలుక్కొని! లేకపోతే నువ్వొక్కడివే దిగమింగుతున్నావా? పానకాల స్వామిపేరు నిలుపుతున్నావ్‌రా! నిన్ను కొయ్యా!'

'చ, ఛా! అదేం లేదండి! ఇంజనాయిలు మార్పించడానికీ, పోలీసోడికీ, చెకింగాడికీ మొత్తం ఇరవై ఇచ్చా! మిగిలింది మీకిచ్చా!'

'మూడు మూణ్నాళ్ళకీ యింజనాయిలు మార్పించానని మస్కా కొడతున్నావ్! బిల్లూ లేదూ నీ బొందా లేదూ! ఎప్పుడో కుక్కను కాల్చినట్లు కాల్చేస్తా!'

'ఎక్కడో జారి పోయిందండి.'

'ఎప్పుడో నీ గూడకూడా జారిపోతుందిరా'

'హో ఇరవై కావాలయ్యా! బియ్యం కొనాలి!'

'బియ్యం లేకపోతే ఎక్కడన్నా కన్నం వెయ్యరా! ఇడియట్!' అంటూనే ఇరవై యిచ్చాడు, హోనరుగారు. పానకాలు గబగబా బస్సువైపు నడవసాగడు.

'ఒట్టి గొడ్డుకు అరుపు లెక్కువనీ,' అట్లాగే కయ్, కయ్యి మంటాడు. ఆ! మనం పట్టించుకుంటేగా! ఆయన అరుపులు ఆయనకీ, మనకరుకులు మనకి! చిల్లర పైసలు తిరిగి యివ్వకుండా దాటేసినదీ, టిక్కెట్లు కొయ్యకుండా డబ్బులు వసూలు చేసిన బాపతూ, గంపలకి ఎక్స్ట్రా వసూలు బాపతూ మొత్తం వో నాలుగూ ఇరవై ఉంది. వోనరుగారికి మస్కాద్వారా ఇరవై! ఆయన యిచ్చినది ఇరవై! ఇవ్వాళ యెవడి మొహం చూశానో మరి!' అనుకున్నాడు పానకాలు.

మస్తాను స్టీరింగుమీద తలవాల్చి చిన్న పైజా కునుకు తీస్తున్నాడు. బస్సులోని సీట్లన్నీ నిండి పోయాయి. టిక్కెట్లిచ్చేసి సిగ్నల్‌గా ప్రక్కరేకుమీద తమతమా ప్రమోగించాడు పానకాలు.

మస్తాను సెల్ఫ్ స్టార్టరు నొక్కాడు. 'గుర్...గుర్రు' మంది ఫోర్డు. అంతేగానీ నిద్రలేవడానికి మాత్రం ఒప్పుకోలా!

మళ్ళీ నొక్కాడు. 'బుర్ ... బుర్రు' మందీసారి. 'సారీ మస్తాన్ భాయ్ మత్తుగా వుంది! వదుకోనియ్యబ్బా!' అన్నట్లు.

అవతల లేలేండ్లలో జనం నిండలేదు. ఇదే సమయం, వెళ్ళిపోవాలి వేంఠనే!

'రేయ్ మా ర్యోదయం గా! కాస్త తొయ్‌మను.' యిక లాభం లేదని ఒక్కసారి మత్తంతా వదిలిపోయేట్టు జలదరించి ఫోర్డు పరుగందుకుంది. నాలు గైదు ఫర్లాంగుల తరువాత లేలెండు తనవెనుకే రావడం మస్తాను చూశాడు. మళ్ళీ మొదలు! 'పాడిందే పాడరా పాచి పళ్ళ దాసరీ!' అన్నట్లు.

కానీ లేలేండు ఈసారి క్షమించలేకపోయింది. అతి స్పీడుగ ప్రక్కనుంచి దూసుకుపోయింది. కానూరు దాటింది. ఫోర్డు నురగలు గ్రక్కుతూ పరుగెడుతూంది. ప్రక్కన జనమూ, యితర వాహనాల ఉనికీ మరిచారిద్దరు డ్రైవర్లు. ఒకళ్ళనొకళ్ళు మించాలి! అదే ధ్యేయం. ఎవరెట్లా మన్నుగొట్టుకు పోయినా వాళ్ళకు ఖాతరు లేదు.

ఇంతలో లేలేండు ఆగవలసొచ్చింది అంత స్పీడులో ఆకస్మాత్తుగా ఆగడంతో వెనుకనున్న మస్తాన్ ఒక్కసారిగా కుడి ప్రక్కకు త్రిప్పాడు స్టీరింగు. ఎదురుగా రెండెడ్లబండి నిమ్మకు నీరెత్తినట్లు వస్తూంది. యిక తప్పదు. బ్రేక్ వెయ్యవలసిందే! ఆ స్పీడులో బ్రేకు వెయ్యడంతో ఫోర్డు రోడ్డుకడ్డం తిరిగి పక్కకు పల్టీ కొట్టింది. లోని జనం 'చాకలి మూటలోని బట్టల్లాగ' ఒకళ్ళమీదొకళ్ళు పడ్డారు. మొత్తానికి పెద్ద ప్రమాదం ఎవరికీ కాలేదు. కుంటుతూ, ముక్కుతూ అందరూ రకరకాల సైనిక విన్యాసాలు చేయసాగారు. 'అరే! ఆ పరుగెడుతున్న దెవరూ? వరి ఊడ్చిన పొలం గట్టు వెంబడే అలా పరుగెడుతున్నాడెందుకూ? ఎవరో తరుముతున్నట్లు! పిచ్చి సన్నాసి జారిపడ్డాడు పొలంలో! అసలే బురదేమో, వంటినిండా చుట్టుకుంది. తుడుచుకోనుకూడ తుడుచుకోకుండా మళ్ళీ పరుగు లంకించుకున్నాడు. మొత్తానికి మంచి స్పోర్ట్స్‌మన్! అంటూ మెచ్చుకున్నారు ప్రయాణికులు తాత్కాలికంగా!

కానీ డ్రైవరుకు కోటా యివ్వవలసిన సమయ మొచ్చినపుడుగనీ, ఆ పరుగెత్తి పారిపోయింది మస్తానని తెలియలేదు వాళ్ళకు. అదృష్టవంతుడు! ●



# వారఫలం

## 24-7-1970 శుక్రవారం మొదలు 30-7-1970 గురువారం వరకు

**మేషం:** వృత్తిలో ఆదాయం బాగా ఉంటుంది. పోటీవారిలో గౌరవం లభిస్తుంది. సాహిత్య కళా రంగాలలో మీ కృషి రాణిస్తుంది. భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. సమయానికి యేదో ఒకవిధంగా డబ్బు చేతికి వస్తుంది.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. వినోద కాలక్షేపాలలో పాల్గొంటారు.

**వృషభం:** లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును. వ్యాపారంలో ప్రయాస కలుగుతుంది. వారం మధ్యలో అన్నివ్యవహారాల్లోను అనుకూలం లభిస్తుంది. ఉద్యోగంలో గౌరవప్రాబల్యాలు బాగా ఉంటాయి. ప్రయాణాలోచనలు చేస్తారు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉండదు. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**మిధునం:** వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. వారం మధ్యలో కొంతమంది వ్యక్తులు మిమ్మల్ని మోసం చేయడానికి ప్రయత్నిస్తారు. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. అనుకూలమైన వార్తలను వింటారు.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో, అధిక వ్యయం జరుగుతుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**కర్కాటకం** వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. స్థిరాస్తి వ్యవహారాలు బాగా ఉంటాయి. సమయానికి యేదో ఒకవిధంగా డబ్బు చేతికి రాగలదు. వ్యాపారంలో మీ ప్రయత్నాలు బాగా ఉంటాయి. మిత్రుల సహాయం లభిస్తుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. దైవ కార్యాలు నెరవేరుతాయి

**సింహం.** అన్నివ్యవహారాల్లోను అనుకూలమైన మార్పులు వస్తాయి. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. వ్యాపారంలో ప్రయోజనం గల సంభాషణలను జరుపగలరు. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. బంధుమిత్రులను కల్సుకొంటారు.

స్త్రీలకు—సంతోషకరమైన వార్తలను వింటారు బంధువులకు సహాయం చేస్తారు.

**కన్య.** సహాయం చేస్తామన్న వారు సమయానికి తప్పుకోవచ్చును. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వారంమధ్యలో వృత్తిలో అనుకూల వార్తలను వింటారు. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉండదు. శుభ కార్యాల విషయంలో అభివృద్ధిని సాధించగలరు.

**తుల:** ప్రయత్నించిన ప్రతి పనీ సులువుగా నెరవేరుతుంది. పోటీవారిలో గౌరవం బాగా ఉంటుంది. వారంమధ్యలో మీరు ప్రయోజనంలేని శ్రమకు గురి కాగలరు. వ్యాపారంలో యెవరినీ విశేషంగా నమ్మడం తగదు. ఆందోళన కలుగుతుంది.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. అధికవ్యయం జరుగుతుంది.

**వృశ్చికం** వ్యాపారంలో శ్రమమీద అనుకూలత లభిస్తుంది. రాజకీయ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. ప్రయాణాలోచనలు చేస్తారు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. ఆడంబరం కోసం వ్యయం జరుగుతుంది.

**ధనుస్సు.** మీకు మున్ముందు లాభించగల వ్యవహారాల్లో అభివృద్ధిని సాధించగలరు. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. వృత్తిలో పోటీ వారితో పోటీ పెరుగుతుంది. ఉద్యోగంలో ఇతరుల నిమిత్తం శ్రమకు గురి కాగలరు. పుణ్య కార్యాలు చేస్తారు.

స్త్రీలకు—వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. పోటీవారితో వాదప్రతివాదాలు తగవు.

**మకరం:** సామాన్యమైన పనులకు కూడా యెంతో కృషి చేయవలసి వస్తుంది. స్థిరాస్థి వ్యవహారాలు బాగా ఉంటాయి. వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. విద్యావైజ్ఞానికరంగాల్లో మీ కృషి రాణిస్తుంది. సజ్జన సాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. దైవ కార్యాలు నెరవేరుతాయి.

**కుంభం.** వ్యాపారంలో అనుకూల వార్తలను వింటారు. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగా ఉంటాయి. ఇతరుల నిమిత్తం చేసే ప్రయత్నాలు సులువుగా నెరవేరతాయి. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది.

స్త్రీలకు—బంధుమిత్రులను కల్సుకొంటారు. ప్రయాణాలోచనలు చేస్తారు.

**మీనం** అన్నివ్యవహారాల్లోను మీ శ్రమకు తగిన ఫలితం లభిస్తుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. మిత్రులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

—మహేష్ ●


లవ్ లెటర్ షాక్
11
బొమ్మల కథ సీరియల్


ఎంతసేపు ఎండలో వుంచినా ఒక్క అక్షరం కూడా కనబడదే!


పోనీ ఏదయినా దీపం ముందు వేడిచేస్తే ఫలితం కనబడొచ్చు!


ఇప్పుడు యీ దీపం సెగ తగిలేలా జాగ్రత్తగా ఆ కాయితం పట్టుకో!


ఒరేయ్ చవటా! ఆ ఉత్తరం కాలిపోతోంది! ఇంక తీసెయ్!


ఇదెక్కడి గోలరా బాబూ! ఉత్తరం సగం కాలిపోయినా ఒక్క అక్షరం కనబడదేరా!


పోనీ డైరెక్ట్‌గా సుజాత దగ్గరకెళ్ళి అందులో ఏం రాసిందో అడిగేసెయ్
ఛీ!


అలా అడిగితే నన్ను ఎందుకూ పనికిరాని చవటకింద కట్టేస్తుంది
(ఇంకా ఉంది)




## 2

అనూరాధ మనస్సు ఎంతో సున్నితమైనది. బాధ్యతల బరువు తెలుసు ఆ మనస్సుకి. తల్లి ఆ వయస్సులో పడుతూన్న కష్టమూ తెలుసు. విస్తళ్లు కుట్టి అమ్ముతున్న సంగతి తెలుసుకున్నదా రోజునే.

ఎంతగానో విలవిల లాడి పోయిందా మృదుహృదయం.

'అమ్మా! మాకోసం నీ రక్తాన్ని పిండి అమ్ముతున్నావు. నీ రుణం తీర్చుకోలేం! అందుకే దైవంకన్నా ముందుగా నీకే నమస్కరించుతానమ్మా!' అంటూ అనురాధ హృదయం బాధతో, కృతజ్ఞతతో మెలిదిరిగి పోయింది.

మరునాడే 'డాన్సు ప్రోగాం' వుంది. అందుకే ఉదయాన లేవగానే నృత్యానికి కావలసినవన్నీ సమకూర్చుకుంది. జయదేవుని అష్టపదులు రెండు అభినయించగలనని తెలియజేసింది.

వెళ్లేది మగపిల్లల కాలేజీకి. కొందరు అల్లరివాళ్లుండక మానరు. చిలిపిగా చిందులు వేయక మానరు. అందుకే సాయంగా తమ ప్రిన్సిపాల్‌నికూడా రమ్మని కోరిందామె.

నృత్యం అరంభమైంది. ఎవరో తుమ్మారు పదిమార్లు. మద్దెల ఆగిపోయింది అభినయం నిలిచిపోయింది, మైక్‌ముందు నిల్చున్నదామె వెంటనే—

'అభినయం ఆపినందుకు క్షమించండి. ఒక్కమనవి. చిలిపితనం మనలో చిందులు వేస్తుందిప్పుడు. నిజమే! కాదనను. అనలేను. కానీ సాటి వ్యక్తిగా మాట్లాడుతున్నాను.

సోదరిగా ఆదరించమని అడుగుతున్నాను. అంతరాయం కలిగించి రసాభాస చేయడం మన యువతరంలో లేనిపని అని పెద్దలు గుర్తించేట్లు ప్రవర్తించగలరని విశ్వసించు తున్నాను. సాటివాని కోరికను అణిచివేయడానికి విద్యార్థులు రాజకీయాలతో కుళ్లిన మనుషులుగారు. ఎదుటి మానవుణ్ణి అపహాస్యం పాలుజేసి వినోదం చూడగలిగేంత మూర్ఖత్వం లేదు మనలో, అని నా నమ్మకం.

మనిషిని మనిషిగా ప్రేమించుతాం—గౌరవించుతాం—అన్నదే మన ధ్యేయం. దీన్నెవరూ కాదనరని నమ్ముతూ— మరోసారి ఆటంకం కలగజేయవద్దని కోరుతూ అభినయం ఆరంభించుతున్నాను—'అన్నది అనూరాధ. ఆ మృదువైన వ్యంగ్యోక్తులకా ఆవరణ అంతా నిశ్శబ్దంలో విలీనమైపోయింది.

ఆకు రాలినా- చీమ చిటుక్కుమన్నా విన్పించేంత నిశ్శబ్దం నిలిచిపోయిందక్కడ. ఆ గొంతున ప్రమోగింది ఆజ్ఞాపన గాదు. అభ్యర్థన అంతకన్నా కాదు. మనిషిలో దాగివున్న మానవత్వాన్ని మృదువుగా మేల్కొల్పింది. అందుకే ఒక్కరూ నోరు కదపలేకపోయారాపైన.

నృత్యం పూర్తయింది. అభినందనలు అనంతంగా కురిశాయి ప్రతివారి మనస్సునుంచి. ఆనందం వెల్లువలై దూకింది. వినమ్రంగా తల వంచి నమస్కరించి వేదికపైనుంచి నిష్క్రమించిందామె.

మరునాటి 'పేపరు'లో అనూరాధ నృత్యాన్ని ప్రశంసించుతూ 'ఫోటో'కూడా ప్రచురించబడింది.

రాజా ఆనందంతో పూగిపోతూ తల్లికి చూపించాడా ఫోటోని. ఆ అనురాగమయి కనుల నిండుగా ఆనందం వెల్లివిరిసిందో క్షణం. అనూరాధనా రోజున కాలేజీలో క్షణమైనా ఒంటరిగా నిలువనీయలేదు.

'అందాలు చిందే బొమ్మ' అని పరవశించుతుందో హృదయం.

'వయారాల లొలికించే మయూరి' అంటోందో కంఠం.

'సరిగమలతో మధువులు కురిపించుతుంది.'

'విరిసిన పూవులా మైమరిపించుతుంది.'

'మెరిసే మెరుపు.'

'విరిసిన వెన్నెల.'

ప్రశంసల కెక్కడా అంతు దొరకడమే లేదు.

అనూరాధ చుట్టూరా అభిమానులో అభినందనల సౌధాన్ని సృష్టించారు. వాటి ధాటికి తట్టుకోలేక అన్నదామె చిన్నగా నవ్వుతూ —

'మరో ప్రశంస వినవచ్చిందో పారిపోతానిక'

'అందాల హరివిల్లు' వెంటనే బాణం రానే వచ్చింది. ఆ క్షణంలోనే లేచి విల్లున్నదామె కోపాన్నభినయించుతూ.

'అనూరాధమ్మగోరూ! మీ కోసం ఎవరో వచ్చారమ్మా!' అంటూ వచ్చాడు 'ప్యూను.'

'అమ్మయ్య! బ్రతికి పోయాను'! అంటూ అందర్నీ తప్పించుకుని బయట పడింది.

ఆ ప్రశంసల జోరులో 'తన కోసం ఎవరో' వచ్చారన్నమాటే విన్నదిగానీ ఎవరైనదీ ఆమె ఆలోచించనేలేదు. 'విజిటర్స్ రూమ్' దగ్గర కొచ్చేసరికా వూహ అలలా లేచింది లోలోన.

లోపలికి అడుగు పెట్టింది సంశయంతో.

'క్షమించాలి! వేళకాని వేళలో వచ్చినందుకు. కూర్చోండి!' అన్నాడో యువకుడు తాను కూడా సోఫాలో కూర్చుంటూ.

ఎదురుగా వున్న మరో సోఫాలో కూర్చున్నదామె ఆశ్చర్యాన్ని అణుచుకుంటూ.

'మీకెంతో ఆశ్చర్యంగా వుందనుకుంటాను. నిన్న మీ 'డాన్సు', చూశాను. మళ్లీ వోసారి మిమ్మల్ని చూడాలన్పించింది. జయదేవుని గీతాలెన్నోసార్లు విన్నాను. ఎందరో అభినయించుతూండగా చూశాను. కానీ మీ అభినయం మాత్రం మనస్సున మందారాల్ని పూయించింది. మీలో నిజంగా 'రాధ' దాగివున్నదన్పించుతోంది. ఏమంటారు?'

'ఇదెక్కడి ప్రశ్న?' నవ్వుకుందామె లోలోన.

పరిచయమూ లేదు. నమస్కార బాణమూ రాలేదు. తనను గురించీ ప్రశ్నించాలేదు. వింతైన మనస్తత్వం అనుకున్నదామె.

'నాకు తెలుసు. మీరు సమాధానం చెప్పరని. ఎందుకో చెప్పమంటారా? మీలో నిజంగా ఆ గోపీకృష్ణుని, అనురాగమయి రాధే! నిలిచి వుంది.' వో క్షణం ఆగాడతడు.

'కాదని తిరస్కరించరన్న నమ్మకంతో వచ్చాను' అంటూ చిన్నపెట్టె ఒకటి తెరిచాడు. కొంచెం ముందుకు వంగి అరచేతిలో వో కృష్ణ విగ్రహాన్ని వుంచుకుని అన్నాడు.

'బొంబాయిలో తీసుకున్నాను ఎలా వుంది?'

దంతంతో అతి సున్నితంగా, అందంగా వయారాల వొలికించుతూ, మందహాసాలు చిలికించుతూ, మురళి పెదవులపై వుంచి మ్రోయించనా! అన్నట్లు నవ్వుతున్నాడు మందరగిరిధారి ఆ విగ్రహంలో. అనూరాధకా విగ్రహం ఎంతో నచ్చింది. వెంటనే తీసికొని హృదయంలో పదిలంగా దాచుకోవాలన్నంతగా పరవశత ఆవహించిందామె నాక్షణంలో.

కానీ అపరిచితుడన్న వూహ మదిలో మెదిలి నిగ్రహించుకున్నదా ప్రయత్నాన్ని.

'ఎంతో అందంగా వుంది!' అంది గొంతునిండుగా మధువు నిండివున్నట్లు.

'అందుకే ఈ కృష్ణుణ్ణి మీ కిస్తున్నాను!'



# ఆరాధన

'నాకా?' సమాధానంగా ఏమన్నదో ఆమెకే తెలియకుండా పోయింది. ఆమె చూపంతా ఆ విగ్రహంమీదే వుంది.

'అవును మీకే! ప్లీజ్! ఇదిగో! తీసికోండి! జీవితంలో ఈ ఒక్కసారైనా నా కోర్కె మన్నించబడిందన్న సంతోషాన్ని మిగలనీయండి! ఉహూ! మీరిక మాట్లాడకండి. నో స్నేహితుడు మనస్సు పడి యిచ్చాడనుకో గూడదా?'

ఆమె కేమనాలో తోచకుండా పోయింది. ఎదుటి వ్యక్తి క్షణక్షణానికీ చిత్రాతి చిత్రంగా మాట్లాడుతున్నాడు. 'తనను పెదవి విప్పనీయడంలేదు. విప్పినా విముఖత అన్నమాటే రాగూడదంటు న్నాడు. ఎంతో విలువైనకానుక అది. అత్యంత ఆత్మీయులకి అందించవలసిన దాన్ని స్వీకరించ మంటున్నాడు. పైగా 'జీవితంలో ఈ ఒక్కసారి నాకోరిక మన్నించ బడిందన్న సంతోషాన్నివ్వండి' అంటున్నాడు. ఎలాంటి మనిషి యితను? ఆశలన్నీ కూలిపోయాయేమొ?' అనూరాధ ఆలోచనలతో మాట్లాడలేక పోయింది.

'వస్తానిక. అదిగో ఆ పెట్టెలోనే నా అడ్రసుంది. ఎప్పుడైనా వో రెండక్షరాలు వ్రాయాలన్పించితే వ్రాయండి. అంతకంటే యింకేమీ కోరను' అన్న వెంటనే వెళ్లిపోయాడా విచిత్ర వ్యక్తి.

పెట్టెలోని కాగితం తీసి చూసింది ఆశ్చర్యంనుంచి తేరుకుని. అందులోని అక్షరాలు చూడగానే కుతూహలం వెలికి వచ్చింది—

'..................!'

ఏమని సంబోధించను? 'రాధా!' అనడానికి ఆత్మీయత లేదే! 'అనూరాధా'! అని వ్రాయడానికి అధికారమూ లేదుగా! అందుకే ఆగిపోయాను. అన్యధా భావించరని నమ్ముతున్నాను.

నిన్న స్నేహితునితో కలిసి మీ నృత్యం చూశాను. మాటలతో కోటలు కట్టడం నాకు రాదు. కాని ఎక్కడో, ఎప్పుడో చదివిన వో గేయం మనస్సున బొంగరంలా తిరుగుతోందప్పటినుంచి — ఏమిటది?! అదీ...ఆ...జ్ఞాపకం వస్తోంది...

.........'మల్లియలా విరిసింది, మనస్సులో
కలహంసలా నడిచింది సొగసుగా
అందెలు—ఘల్లు మన్నాయి!
డెందము—ఝల్లుమన్నాది!
మయూరమ్మై—ఆడె
ఒయారమ్మై—పాడె'

నిజం! అంతే! అచ్చు మల్లియలా, వెన్నెల వెల్లువలా, కన్నులు చెదిరే అందాల అపరంజి బొమ్మలా మెరిసిపోయారా వేషంలో మీరు.

నవ్వుకుంటున్నారనుకుంటాను. నా పిచ్చి వూహల్ని విని. మీరు నవ్వుకున్నా బాధపడను లెండి.

నా మనస్సు పోకడలు అందరికీ నచ్చవు. అందుకే ఆత్మీయులు అన్నవాళ్ళు లేకుండా చేశాడు భగవంతుడు. కానీ..... మీరు......మీరు. ఎందుకో మరి! ఈ డాక్టరి వింత మనస్తత్వాన్ని అర్థం చేసుకోగలరన్పించింది. మీరు వ్రాయమంటే నా గురించి వున్నదంతా మనస్సు విప్పి మరీ వ్రాస్తాను. ఎందరో గోపికల హృదయాల్లో రాగమయుడై నిలిచిన ఆ గోపీకృష్ణునికోసం అంతగా జీవితాంతమూ ఆరాధించిన రాధ హృదయంలో దాగివున్న రహస్యం తెలుసు మీకు. అందుకేనేమో! మీపేరూ 'అనూరాధే' అయింది.

జవాబుగా ఎంతో వ్రాయమని అడుగను. కొంతైనా వ్రాయగలరని మాత్రం నమ్ముతూ—

మధురమైన మీ మనస్సున—
స్నేహితుడిగా నిలిచిపోవాలని—
కోరుతూ—
'హరికృష్ణ'

అడ్రసు వ్రాయడం మరిచిపోలేదు లెండి—
డాక్టరు హరికృష్ణ.
త్యాగరాయనగర్
మద్రాసు.

'విచిత్రమైన మనిషి! ఏమని వ్రాయాలి ?!' నవ్వుకుంటూ లేచి క్లాసురూమ్ కేసి నడిచివెళ్లిందామె.

మరునాడే, రసమయ చక్రవర్తీ, రాధారమణునే, బహూకరించిన మీ సహృదయతకూ, కళాభిమానానికీ కృతజ్ఞతగా— వందనాలూ—' అంటూ వో రెండు వాక్యాలు జవాబుగా వ్రాసింది.

మళ్లీ తుఫానులా ఏమని వ్రాస్తాడో

అన్నవూహ ఆమె మనస్సున కదులుతూనే వుంది. ఆ విగ్రహాన్ని చూసి తల్లికూడా 'ఎంతో విలువైనదమ్మా!' అన్నది. 'అతని హృదయమూ అంత విలువైనదే [illegible]!' అనుకున్నదామె లోలోన.

పరీక్షలు దగ్గర పడుతూండడం మూలాన మరోధ్యాసే లేకుండా చదువులో లీనమైపోయిందారోజునుంచి. ఇద్దరు, ముగ్గురు డ్యాన్సు ప్రోగ్రాములు ఏర్పాటు చేయాలని కోరినా పరీక్షలమూలాన మృదువుగా యిపుడు వీలుపడదని చెప్పింది.

పదిరోజులు గడిచిపోయాయి. అతని నుంచి ఏ సమాధానమూ లేదు. రాలేదన్న మాట అపుడపుడు మదిలో మెదులుతూనే వుంది అనూరాధకు. ఆనాడు కాలేజికి బయల్దేరుతూండగా 'పోస్టుమాన్', ఓకవరందించాడు. పైన వున్నవ్రాత కొత్తగా వుంది.

'రామకృష్ణా నాటక సమాజం' వారు అనూరాధను పిలిచినపుడు ఓ నృత్య ప్రదర్శనే మద్రాసులో యిమ్మని కోరుతూ వ్రాసారు.

ఆసంగతి వినగానే అన్నపూర్ణమ్మగారి కెంతో ఆనందం కలిగింది. కానీ మరు క్షణంలోనే భారంగా నిశ్వసించిందామె. తల్లి మనస్సున చెలరేగిన భావాల్ని పసిగట్టి అన్నది అనూరాధ —

'మద్రాసులో నా స్నేహితురాలుందమ్మా! వాళ్ళ నాన్నగారు రిటైర్డు జడ్జి. ఆయనకు వ్రాస్తే సాయంగా ఎవరినైనా పంపించుతారు.'

'సరే! ముందు పరీక్షలు కానివ్వు!' గంభీరత వెనుక లోనున్న వ్యధ అణిగిపోయింది.

ఆ రోజునే జడ్జి అనంతశయనం గారి కూతురు, మంజులపేరిట ఓ వుత్తరం వ్రాసింది. సమాజం వారికికూడా పరీక్షలు ముగిసిన నాలుగవరోజునే ప్రదర్శన యివ్వగలనని అంగీకారాన్ని తెలియజేసింది. 'అంత తొందరెందుకమ్మా!' అని ఆ తల్లి అడుగలేకపోయింది. పరిస్థితులు చూస్తే గడ్డుగా వున్నాయి.

బ్యాంకులో నిల్వ ఖాళీ అయింది. పదిరోజులనుంచి అనారోగ్యం మూలాన విస్తళ్ళు కుట్టడం తగ్గిపోయింది. మిషను మీద చేయివేయగానే తలనొప్పి వస్తోంది



విపరీతంగా. అయినా అలాగే ఆ బాధతోనే కొన్నిబట్టలు కుట్టి పంపించుతోందా అనురాగమయి.

తల్లి నలతగా వుండడం గమనించింది అనూరాధ. కానీ ఆ పని మానుకుంటే పస్తులు వుండవలసిందే. ఆకలితో రాజీ పడవలసిందే. అందుకే తల్లిబాధను చూసి మనస్సున దాగిన వ్యధతో కుమిలిపోతున్నా అణుచుకున్నది అనూరాధెంతో ప్రయత్నం మీద. అందుకే ఆ నాటక సమాజం వారి కోరికను అంగీకరించినపుడు తల్లీ కూతుళ్ళిద్దరూ మరోమాట మాట్లాడలేక పోయారు.

పరీక్షలు ముగిశాయి. బాగానే వ్రాశాననుకుంది అనూరాధ. తమ్ముడు, రాజాకికూడా స్కూల్‌ఫైనలు పరీక్షలు ముగిశాయి. పాసవుతానని అన్నాడతడు. కన్నబిడ్డల కష్టాలు తీర బోతున్నాయన్న ఆశారేఖ తళుక్కుమన్నదా తల్లి హృదయంలో. ఆ రోజునే మద్రాసునుంచి, అనూరాధ స్నేహితురాలు, మంజుల జాబు వ్రాసింది. వేసవి గనుక వెంటనే రమ్మనీ, నృత్యానికి కావలసినవన్నీ అక్కడే ఏర్పాటు చేసికో వచ్చుననీ, సాయంగా నాన్నగారున్నారని వ్రాసింది. రాజానుకూడా వెంటతీసుకుని రమ్మన్నది.

కూడా తీసికొని వెళ్ళాలనివున్నా ఖర్చులకు కావలసినంత డబ్బులేక పోవడం మూలాన ఆ భావనే రానీయ లేదామె. అక్కతోపాటు వెళ్ళాలని సరదా పడుతున్నా ఆర్థికంగా తామే ఎత్తులో వున్నారో తెలిసికున్న రాజాకూడా తన సరదాను అణుచుకున్నాడు.

అనూరాధను ఒంటరిగా పంపించడం అన్నపూర్ణమ్మగారికే మాత్రమూ యిష్టంగా లేదు. కానీ సాయం ఎవరూ రారు అందుచేత అన్నదామె బయలుదేరుతూండగా—

'జాగ్రత్త తల్లీ! వెళ్ళగానే జాబు వ్రాయి. త్వరగా వచ్చేయి!'

'రాజా! మద్రాసునుంచి ఏం తీసుకురాను నీకు?' అన్నది తల్లికి సమాధానమిచ్చిన తరువాత. రెండు మూడు నిమిషాల వరకూ నిశ్శబ్దంగా వుండిపోయాడు రాజా. తమ పరిస్థితులు తెలిసిన ఆ పసివాడి హృదయంలో ఎన్నో కోరికలున్నా అణుచుకున్నాడు —

'నాకా? ఏం తెస్తావక్కా! నువ్వు త్వరగా వచ్చేయి! ఒక్కడికే నాకేమీ తోచదిక్కడ!'

ఆ సమాధానం విన్న తల్లీ కూతుళ్ళ కన్నుల నిండుగా నీళ్ళు తిరిగాయి. కళ్ళతోనే వెళ్ళొస్తానంది అనూరాధ. మరోసారి పెదవి కదిపితే లోనున్న వ్యధ ఒక్కమారుగా వెల్లువలా దూకి వచ్చేట్టుంది. అందుకే మౌనంగా సెలవు దీసికొన్నదామె.

తోడుగా స్టేషనువరకు రాజా వచ్చాడు. టికెట్ తీసికొని తమ్ముడిని వెళ్ళమన్నది. 'ఎండకాస్తోంది రాజా! కాళ్ళు కాలిపోయేట్టున్నాయి మరికొంచెం సేపు వుంటే! వెళ్ళు! బండెక్కగలనులే' అతని లేత పాదాలకు చెప్పులు లేవు. అందుకే అలా అన్నదామె. రాజాకూడా సెలవుదీసికొని వెళ్ళిపోయాడు వెళ్ళాలని లేకపోయినా.

రెండురోజులు ముందుగానే బయల్దేరింది అనూరాధ. మంజుల కోరికను నిరాకరించలేక అలా చేసిందామె. 'వెయిటింగ్ రూమ్'లో కూర్చున్నది—అంతలో గంటకొట్టడం విన్పించి రైలు ఎటు నుంచి వస్తుందబ్బా! మద్రాసు పోయేదేనా!' అని లేచివచ్చింది.

ఏదో రైలువచ్చింది. ప్రయాణీకులు దిగుతున్నారు హడావిడిగా. ఎక్కేవారు ఎక్కుతున్నారు. అది మద్రాసునుంచి వచ్చిందని తెలిసింది. ఉదయాన రావలసినది ఏదో అవాంతరాలవలన అప్పటికి చేరింది.

ఎక్కేవారూ, దిగుతూన్న ప్రయాణీకుల్ని చూస్తూ నిలబడిపోయింది అనూరాధ.

'హల్లో! అనూరాధగారూ! ఇదేమిటి?! ఇక్కడున్నారు?!' అంటూ వచ్చాడో యువకుడు.

'అరే! హరికృష్ణగారుకదూ!' అని అనుకుంటూండగానే దగ్గరకు వచ్చాడతడు.

'గుర్తున్నానా?' అన్నాడు నవ్వుతూ.

'మీరు నేను గుర్తుండనేమోగాని, మీరు మాత్రం మాయింట్లో అందరికీ గుర్తే'

వున్నారు' అన్నది అనూరాధ నమస్కరిం చిన తరువాత.

'అహా! మీకూ కోపం వచ్చిందను కుంటానే!'

'ఏం రాగూడదా?'

'సరిపడినంత కారణం లేకుండా కోపం రావడం నాకేమాత్రమూ నచ్చదు. మీకు జవాబు వ్రాయలేదని కోపం వచ్చి వుంటుం దని తెలుసు. కానీ వ్రాయడాని మీ రవ లేదుగా?' ఆ కంఠాన పసిబిడ్డ హాఠం తొంగిచూసింది.

ఆమాట విన్నవెంటనే అతనివంక చూసిందామె అమాయకత తప్ప మరే భావమూ లేని డాక్టరి కనులలో. వచ్చి వున్నా అలాను కున్నదందుకే.

'మీ జవాబు బావుంది. మరి నాకు బహుమతి నీయమని మీకు వ్రాసిన గుర్తు లేదే? ఎందుకిచ్చారో అంత అందమైన దాన్ని?'

'నిజమే! తప్పే! క్షమించండి!' అతని ఉత్సాహం చల్లారిపోయింది. ఆ న్నిటు హ్యాసయుతికా ప్రశ్న కటువుగా విన్పించిం దని గ్రహించింది అనూరాధ. అందుకే మాట మార్చింది.

'చూడండి! డాక్టరుగారూ! మీరు నాకోసాయం చేసిపెట్టాలి?'

'ఏమిటది? మళ్ళీ నా బహుమతిని నన్ను తీసికోమంటారా?'

'అబ్బా! మీకా బహుమతి గొడవే ఎప్పుడూ. మరో ధ్యాసవున్నట్లు కన్పించ డం లేదు. మద్రాసులో నాకో 'ప్రోగ్రాం' వుంది శనివారం నాడు. అందుకే వెళ్తున్నానిపుడు. రామకృష్ణ సమాజం వారట రమ్మని వ్రాశారు. అడ్రసు యిచ్చారు కానీ కొత్తగనుక అడుగు తున్నాను. నేను జడ్జి అనంతశయనం గారి యింటిదగ్గర వుంటాను. కొంచెం శ్రమ అనుకోక ఆ సమాజానికి దారి తెలియచేయగలరా? మీరిపుడసలు ఎక్కడి నుంచి వస్తున్నారు?'

'మద్రాసునుంచే! మీ కోసమే వస్తు న్నాను!'

'నాకోసమా? ఎందుకూ?!' ఆశ్చర్యం తొంగి చూసిందామె కంఠాన.

'ఆ సమాజం సెక్రెటరీ నా స్నేహి తుడే! మిమ్మల్ని వెంటబెట్టుకుని రమ్మ న్నాడు. మీరు నాకు తెలుసునని చెప్ప గానే' అన్నాడతడు.

'అపరిచితుల వెంట ఎలా రాగలననుకున్నారు' అనాలనుకున్న దామె. కానీ ఆతడా ప్రశ్న వినగానే ముఖాన గంటు పెట్టుకుంటాడని ఆగిపోయింది.

'అలాగా! మళ్ళీ వెంటనే ప్రయాణం అయిందే మీకు అలసి పోయినట్టున్నా రిప్పటికే!' అన్నది అతని అలసటను గమనించి.

'ఫరవాలేదులెండి టిక్కెట్లు తెస్తాను' అని అతడు వెళ్ళబోయాడు.

'నేను తీసికొన్నాను మీరు తెచ్చు కోండి' అన్నదామె తన చేతిలోని టిక్కెట్ చూపించుతూ.

'ఇదేమిటి?! థర్డ్‌క్లాసులోనా? మీ ప్రయాణం! నో! నో! ఉండండి ఫస్టు క్లాసు తెస్తాను!' వెళ్ళబోయాడా డాక్టరు.

'క్షమించండి ఎందరో ప్రయాణం చేస్తున్నారా తరగతిలోనే. అంతకన్నా మరో మెట్టెక్కి అక్కడి స్వర్గాన్ని చూడగలనన్న నమ్మకం లేదు నాకు.' అన్నదామె. విచిత్రంగావుంది జవాబు అని అన్పించిందతనికి. ఆమెవంక చూశాడో క్షణంసేపు.

'మీది గాంధీమతమను కుంటాను' అన్నాడు.

'ఏం మీకు బాధగా వుందా?'

'లేదనుకోండి! సరే! వస్తానుండండి.' అంటూ వెళ్ళాడతడు. అంతలో మద్రాసు రైలు రానే వచ్చింది. అతనికోసం చూసింది. కానీ కన్పించనే లేదెంత సేపటికీ. బండి కదులుతుండగా రాడని నిశ్చయించుకుని సూట్‌కేస్ పట్టుకుని రద్దీ తక్కువ అన్పించిన ఓ పెట్టెలో ఎక్కింది. కూర్చుంటూండగా గాలివానలా ప్రవేశించాడా డాక్టరు.

'థర్డ్‌క్లాస్ కదండీ! దొరికేసరికి ఆలస్యమైంది' అన్నాడు ఆమెకు ఎదరుగావున్న సీటులో కూర్చుంటూ.

'మీరు ఫస్ట్‌క్లాస్‌లో రావచ్చుగా?'

'మరీ అంతమూర్ఖుడు కాడండోయ్ ఈ హరికృష్ణ! కొంచెం మెదడుంది.' అన్నాడు చిన్నగా నవ్వుతూ.

ఆమెకూడా మందహాసం చేసింది చిన్నగా. తరువాత అతడు ఆ సమాజం ఎంతో పేరు పొందినదనీ, ఎంతోమంది నిలా ఆహ్వానించి సత్కరించుతుందనీ తెలియచేశాడు.

మద్రాసులో వున్న మంచి సమాజాలలో అదొకటి అని చెప్పాడు.

**(ఇంకా వుంది)**



# ప్రదానం...

# ...అక్షరం

# అందం...

# ...గ్లామర్

# సంగీతం...




వేదిక దృశ్యం



ఉపన్యసిస్తున్న ప్రొ

ఆంధ్రసచిత్ర వారపత్రిక చాలా సంవత్సరాలుగా ఫిలింబాలట్‌ను నిర్వహిస్తున్న విషయం పాఠకులకు తెలుసు ఈ సారి 'సిందాల్'తో కలిసి, బహుమతులు ప్రకటించడం కూడా మీకు తెలుసు. ఈ బాలట్‌లో ఉత్తములుగా ఎన్నికయిన కళాకారులకు, 'ఆంధ్రసచిత్ర వారపత్రిక—సింథాల్' పోటీలో నెగ్గిన ప్రథమ ద్వితీయులకు బహుమతులనిచ్చే ఉత్సవాన్ని జూలై 5న ఫుంక్‌లాండ్స్ హోటల్‌లో వైభవంగా జరిపారు

## రంగు రంగుల చీరెలు

ఫంక్షన్ ఆరు గంటలకు ప్రారంభమయినా, సాయంత్రం అయిదుగంటల నుంచి ఆహ్వానితులు రాసాగారు రంగు రంగుల చీరెలు ధరించిన వయ్యారి భామలు, టిప్‌టాప్‌గా డ్రస్ చేసుకున్న మగరాయళ్లు, పండు ముత్తయిదువలు, పసిడిపాపలు, విజ్ఞులు, వ్యాపారస్థులు — యిలా ఎంతమంది వచ్చారో తెలుసా? అయిదువందలు దాటి వుంటుంది. సభ నిండింది.

# పదహారణాల ఆంధ్రత్వం

అయిదు నలభై అయిదు అయింది హీరో నాగేశ్వరరావుగారు పదహారణాల ఆంధ్రమూర్తిగా, స్టయిలిష్‌గా అంబాసిడర్లో దిగడమే తరువాయి, గోద్రెజ్ సోప్స్ మద్రాసుశాఖ మేనేజరు శ్రీ ఎ కె శేషగిరిరావు ఒక ప్రక్క, ఆంధ్రసచిత్ర వారపత్రిక ముఖ్య ఉప సంపాదకులు శ్రీ మాధవరావు, ఉప సంపాదకులు శ్రీ కనకాంబరరాజు మరొక ప్రక్క హీరోగారికి స్వాగతం పలికారు శ్రీ అక్కినేని వచ్చిన పది నిమిషాలకు ఊర్వశి శారద బంగారు వన్నె చీరె ధరించి, చిరునవ్వు ముఖంతో సభలో ప్రవేశించింది నటి కాంచన ధగధగ మెరిసే జరీ అంచు తెల్ల చీరె, చీరె రంగు జాకెట్టు ధరించి, సభలో అడుగిడుతుంటే అప్సరస వచ్చిందా అన్నట్టు ఆహూతులు ఆమె వంక చూడసాగారు కరెక్టుగా ఆరు కొట్టిందో లేదో అధ్యక్షపదవి నలంకరించే శ్రీ పి పుల్లయ్య, గబగబ స్టిమత్ దిగి, లేటు అయిందో యేమో అన్నట్టు, తన గడియారం వంక చూసుకుంటూ లాన్‌ను ప్రవేశించారు దర్శకుడు శ్రీ వి మధుసూదనరావు, శ్రీ కె వి మహదేవన్ కుమారుడు వచ్చి ఆసీనులయ్యారు.

# ప్రెట్టీ జమున ఆగమనం

ముఖ్య అతిథి శ్రీమతి జమున శారదా స్టుడియోలో షూటింగు ముగించి రాకెట్



పోటీలో గెలిచిన సురేష్, రఘునాథరావుల మధ్య కాంచన

వేగంతో యింటికొచ్చి, అయిదు నిమిషాల్లో డ్రెస్ అప్ చేసుకుని, తన ఫియట్‌లో వుడ్‌లాండ్స్‌కు వచ్చి చేరింది నటి జమున గోధుమ రంగు పట్టుచీరె + అదే కలర్ జాకెట్టు ధరించి, సభను ప్రవేశిస్తుంటే సదస్యులు అందరూ ఆమె అందమయిన నడకను, ఆమె ప్రెట్టీ ముఖ సౌందర్యాన్ని చూస్తూ విస్తుపోయారు చంద్రకళ, శోభన్‌బాబుగార్లు మేకప్‌తో వేదికనలంకరించారు.

అతిథులకి అల్పాహారవిందు చేశారు వెంటనే సభా కార్యక్రమం పిఠాపురం ప్రార్థన గీతంతో ప్రారంభమైంది సభాధ్యక్షులు శ్రీ పి పుల్లయ్య మాట్లాడుతూ 'తల్లీ బిడ్డల సంబంధం లాంటిదే ప్రేక్షక–కళాకారుల అనుబంధం' అన్నారు చిత్తశుద్ధిగల నటుడు శ్రీ అక్కినేని అని ప్రస్తుతించారు

# అవార్డులోవున్న థ్రిల్ + ట్రబుల్

ఉత్తమ నటుడి అవార్డునందుకున్న నటసామ్రాట్ 'మొట్టమొదటి అవార్డునందుకున్నప్పుడు నా ఆనందానికి మేర లేదు కానీ యీ అవార్డులందుకోవడం నాకు అలవాటైపోయింది ఉత్తమ నటుడి హోదాలో నేను యీ అవార్డును స్వీకరించడం లేదు మెచ్చుకున్న వారికి కృతజ్ఞత తెల్పవలసిన బాధ్యత నాకుంది. ఆంధ్రసచిత్ర వారపత్రిక సినిమా పరిశ్రమకు ఈవిధంగా సేవచేయడం ముదావహం. చక్కటి వ్యవహారదక్షత, వ్యాపారదక్షత గల్గిన గోద్రెజ్‌తో కలిసి మమ్మల్ని ఇలా గౌరవిస్తున్నందుకు కృతజ్ఞతాభివందనాలను తెల్పుకుంటున్నాను లలితకళల్లో వుండేవాళ్లు విద్యార్థిగానే వుంటారు.

58 వ పేజీ చూడండి)



ఆంధ్ర సచిత్ర వారపత్రిక సంపాదకవర్గం, గోద్రెజ్ సోప్స్ నిర్వహణ ప్రతినిధి నవ్వులో మునిగిన ఉత్తమ నటి, ఉత్తమ నటుడు, ఆలోచనలో మునిగిన అధ్యక్షులు, ఆహూతులు వంచిపెట్టిన నటీమణి, ఉత్తమ దర్శకులు, భక్త రామాయణుడు, శ్రీ అక్కినేని నాగేశ్వరరావు.

విషయ శీఘ్రముగా నిర్ణయించడం కష్టం. అవార్డులో వుండే 'థ్రిల్' నాకు బాగా తెలుసు. ఈ అవార్డు స్వీకరణతో నా బాధ్యత మరింత పెరుగుతూ వుంది. ఈ బాధ్యతను పరిరక్షించుకోగలనని మనవి చేసుకుంటున్నాను' అన్నారు.

## శారదకు జమున ప్రశంస

ముఖ్య అతిథి శ్రీమతి జమున యిలా ప్రసంగించారు. హీరో నాగేశ్వరరావుగారిని గూర్చి మీకు కొత్తగా పరిచయం చెయ్య వలసిన పని లేదు. 25 సంవత్సరాలుగా చిత్రకళామతల్లికి సేవచేస్తూ వున్నారు. కథానాయకుడిగా వివిధ రకాలయిన పాత్రలను ధరించి మెప్పించి వున్నారు. ఇలాగే ప్రతిసంవత్సరం ఆయనకు వుత్తమనటుడు అవార్డు రావాలని కోరుకుంటున్నాను.

## ప్రదానం...

(58వ పేజీ తరువాయి)

సింథాల్' పోటీలో మొదటి బహుమతి పొందిన శ్రీ ఎం. రఘునాథరావుకు రు. 2,000 చెక్కును, ద్వితీయ బహుమతి పొందిన శ్రీ ఆర్. సురేష్‌కు రు. 750లు చెక్కును బహుమతిగా అందచేసారు. అలాగే బాలట్‌లో వుత్తములుగా ఎన్నికయిన శ్రీయుతులు నాగేశ్వరరావు, శారద, వి. మధుసూదనరావు, రాజబాబుగార్లకు మెమెంటోలు నందచేసారు. శ్రీమతి జమున రమణారావు చంద్రకళ, శోభన్ బాబు, మహదేవన్ తరఫున సభకి హాజరైన ఆయన కుమారునికి ట్రాఫీలిచ్చారు.

## ప్రముఖుల ఆగమనం

ఈ బహుమతి ప్రదానోత్సవ సభకు చలన



సభలోపలికి వచ్చిన వారందరికీ సింథాల్ ఉత్పత్తి వస్తువులు పంచిపెట్టారు. పిఠాపురం నాగేశ్వరరావు, ఎ. కె. శేషగిరిరావు.

శ్రీమతి శారదకు ఊర్వశి అవార్డు వచ్చినప్పుడు, మా అందరికి వచ్చినట్లే ఫీలయ్యాము. మలయాళరంగంలోనే గాక, ముమ్ముందు తెలుగురంగంలోకూడా ఉత్తమనటిగా ప్రకాశించాలని కోరుతున్నాను. నూరు చిత్రాలకు పైగా నటించినా, యిలాంటి గౌరవం యెవ్వరికీ దక్కలేదు.' అన్నారు.

ఉత్తమదర్శకుని బహుమతి పొందిన శ్రీ వి. మధుసూదనరావు 'ఆంధ్రసచిత్ర వారపత్రిక చేస్తున్న సేవను వుగ్గడిస్తూ, 'మనుషులుమారాలి'లాంటి సంచలన చిత్రానికి ప్రజాదరణ మాత్రమేగాక ప్రభుత్వం ప్రోత్సాహంకూడా చాలా అవసరం' అని మాట్లాడారు.

## కాంచన బహుమతి ప్రదానం

నటి కాంచన 'ఆంధ్రసచిత్రవారపత్రిక చిత్రపరిశ్రమ ప్రముఖులయిన శ్రీయుతులు చక్రపాణి, వి. బి. రాజేంద్రప్రసాద్, చెరుకూరి పూర్ణచంద్రరావు, రామానాయుడు, లక్ష్మీఫిలింస్ శివరామకృష్ణయ్య, మాధవీ కంబైన్స్ రాజేంద్రప్రసాద్, ముళ్ళపూడి వెంకటరమణ, కాట్రగడ్డ నరసయ్య. వుత్తమ చిత్ర కుటుంబరావు, విజయచిత్ర విశ్వనాథరెడ్డి, కొడవటిగంటి కుటుంబరావు, ఎం. ఎస్. మూర్తి, రాజేంద్రప్రసాద్ (ఎస్. వి. కె ఆర్. ఏజన్సీస్), గర్లు విచ్చేసారు. 'ఆంధ్రసచిత్రవారపత్రిక సింథాల్' పోటీకి న్యాయనిర్ణేతలుగా వ్యవహరించిన శ్రీయుతులు డి. వి నరసరాజు, బాపు, రామలింగంగార్లు పాల్గొన్నారు.

ఆంధ్రసచిత్రవారపత్రిక ముఖ్య ఉపసంపాదకులు శ్రీ ఎం. మాధవరావు వందన సమర్పణ గావించారు.

## వేదికపై జమున పాట

ఆహూతులకు శ్రీ పి. బి. శ్రీనివాస్ ఎ. ఎ. రాజా ఆర్కెస్ట్రాతో తెలుగు, తమిళ, మరాఠీ పాటలను వినిపించారు. 'పెళ్ళిరోజు' చిత్రంలో జమున, శ్రీనివాస్‌తో కలిసి పాడిన 'పెళ్ళివారమండీ, ఆడ పెళ్ళివారమండీ' పాటను జమున శ్రీనివాస్‌తో యిక్కడ పాడడం ఈ వుత్సవానికి ప్రత్యేకతను చేకూర్చింది.

## బాలసరస్వతియా!

శ్రీనివాస్ ప్రోగ్రాం కాగానే, పదేండ్ల బాలిక చిరంజీవి గాయత్రి తన అపూర్వ వైణిక విద్వత్తుతో సభను ఆశ్చర్య చకితుల్ని చేసింది.

ఆరుగంటలకు ప్రారంభమయిన యీ బహుమతి ప్రదానోత్సవం తొమ్మిదిగంటలకు పూర్తయిందన్న మాటేగాని — 'అప్పుడే అయిపోయిందా? యింకాస్సేపు వుంటే బాగుండేది' అనిపించింది.

## కృషి ఫలించింది

'ఆంధ్ర సచిత్ర వారపత్రిక—సింథాల్' వారు నిర్వహించిన ఈ ఫంక్షన్ అత్యంత వైభవంగా జరగడానికి కారణభూతులయిన గోద్రెజ్ సోప్స్ మద్రాసుశాఖ మేనేజరు శ్రీ ఎ. కె. శేషగిరిరావును, వారి సేల్స్ సూపర్‌వైజర్ శ్రీ రామానుజంను, ఎకౌంటెంట్ శ్రీ లక్ష్మీనారాయణ్‌ని, ఆంధ్రపత్రిక ఎడ్వర్టైజ్‌మెంటు మానేజర్ శ్రీ శంకరనారాయణ ఆంధ్ర సచిత్ర వారపత్రిక సంపాదక వర్గంలోని శ్రీ మాధవరావును, శ్రీ కనకాంబరరాజును అభినందించి 'ఈ ఫంక్షన్ గ్రాండ్‌గా వుండింది అంటే—దానికి కారణ కర్తలుగా వుండిన వ్యక్తుల నిర్వహణ సామర్థ్యమే' అనడం సమంజసం.

## శుభప్రదమయిన ప్రదానం

అక్షరం (ఆంధ్ర సచిత్ర వారపత్రిక) + అందం (సింథాల్) కలిసి స్మార్ట్ + ఊర్వశికి యేర్పాటు చేసిన ఈ ప్రదానం శ్రీ పి పుల్లయ్య అధ్యక్షతన సర్వలక్షణ సమన్వితంగా జరిగింది.

—శ్రీనివాస్

# ప్రదానంలో పరాచికాలు

మోహన్‌కుమార్

ఈ నెల 5వ తేదీ సాయంకాలం స్థానిక న్యూ ఉడ్‌లాండ్స్ హోటల్ లాంజ్‌లో చెప్పుకోదగిన విశేషం ఒకటి జరిగింది. అది 'ఆంధ్ర సచిత్ర వారపత్రిక — సింథాల్ పోటీ'లో ఉత్తములుగా ఎన్నికయిన సినిమా తారలకు, సాంకేతిక నిపుణులకు, ఫిలింఫాన్స్‌కి బహుమతి ప్రదానం చేయటంకోసం ఏర్పాటు చేయబడిన సమావేశం అది.

ఆహ్వానితునిగా ఆ సాయంత్రం నేనూ వెళ్ళాను. పాత్రికేయ మిత్రులంతా ఒక్కొక్కరుగా వస్తున్నారు. కొద్ది సేపటికి రాజ్‌బాబు వచ్చాడు. అతనున్నచోట ఎంతో సందడి ఉంటుంది. కలుపుగోలుగా ఉంటాడు. వస్తూనే 'హాయ్', 'హలో', 'హౌ ఆర్‌యు' అంటూ అందర్నీ ఉషారుగా పలుకరిస్తూ ముందుకి వచ్చాడు. 'ఆంధ్రపత్రిక బేలట్‌లో ఈ సంవత్సరం నన్ను ఉత్తమ హాస్యనటుడిగా ఎన్నిక చేశారు. ఇలా పత్రిక బేలట్‌లో ఎన్నిక కావటం ఇదే మొదటిసారి. ఇది నాకెంతో గర్వకారణం' అన్నాడు రాజబాబు — నాతో. అతని కళ్ళలో ఎంతో సంతృప్తి కనిపించింది. 'ఆంధ్ర సచిత్ర వారపత్రిక ఇదివరకు బేలట్‌లు మాత్రమే నిర్వహించింది. ఈ యేడాది ఆ బేలట్ విజేతలకు బహుమతి ప్రదానం చేయడం — అందుకోసం ఒక సభను ఏర్పాటుచేయడం కూడా ఇదే మొదటిసారి!' అన్నాను నేను.

*  *  *

కొంత సేపటికి హీరో శ్రీ అక్కినేని నాగేశ్వరరావు, దర్శకులు శ్రీ పి. పుల్లయ్య, శ్రీ వి. మధుసూదనరావు, శ్రీమతి శారద, కుమారి కాంచన వచ్చారు.




సినిమా రంగానికి చెందిన అనేకమంది ప్రముఖ నిర్మాతలు, పంపిణీ దారులు, — ప్రయివేటు రంగాలకు చెందిన మరికొంత మంది ప్రముఖులుకూడా ఈ ఉత్సవాన్ని తిలకించడంకోసం వచ్చారు.

ఆహ్వానితులంతా వచ్చాక అల్పాహార విందు ప్రారంభమైంది. ఎవరిమట్టుకు వారు తింటూ ముచ్చట లాడుకుంటున్నా అందరికళ్ళూ రిసెప్షన్‌వైపే ఉన్నాయి. రావలసిన ముఖ్య అతిధి రాలేదు. అందుకే అంతా ముఖ్య అతిధి మేడమ్ జమున కోసం చూస్తున్నారు. అల్పాహార విందు అనంతరం మరికొంతసేపు చూసి, టైము అయిపోతున్నదని సభ ప్రారంభించారు. ఈ ఉత్సవ విశేష సభకు పద్మశ్రీ (పిక్చర్స్) పుల్లయ్యగారు అధ్యక్షులు. సభ జరుగుతుండగా — బేలట్‌లో ఉత్తమ సహాయ నటీ నటులుగా ఎన్నికయిన శోభన్‌బాబు, కుమారి చంద్రకళ — షూటింగ్ ఉండటంవల్ల కాబోలు లేటుగావచ్చి సభలో పాల్గొన్నారు.

మేడమ్ జమున వచ్చారు. అందరి కళ్ళూ ఒక్కసారిగా ఆమెమీద కేంద్రీకృతమయ్యాయి. ఆమె రాకతో సభకు నిండుదనం వచ్చినట్లయింది. 'షూటింగ్ ఉండటంవల్ల ఆలస్యం అయింది. ఆలస్యం అవుతుందని సభ నిర్వాహకులకి ముందుగానే తెలియజేశాన'న్నారామె. పుల్లయ్యగారు, నాగేశ్వరరావుగారు మధుసూదనరావుగారు, మేడమ్ — అంతా ప్రసంగించారు. పుల్లయ్యగారు తమ ప్రసంగంలో పొరపాటున — ఏమిటి — పరధ్యానాన ఆంధ్ర సచిత్ర వారపత్రిక అనడానికి బదులు ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక అని రెండుసార్లు అన్నారు. 'అందుకు మిత్రులు శ్రీ రాధాకృష్ణ నన్ను మన్నిస్తారని ఆశిస్తున్నాను. ఓల్డేజవల్ల దొరలిన పొరపాటు అది' అన్నారు పుల్లయ్యగారు.

ఆ మాటను హీరో నాగేశ్వరరావుగారు ఖండిస్తూ 'ఓల్డేజ అంటే ఒప్పుకోను. మిస్టేక్ అనండి' అన్నారు, జోక్‌గా. 'సరే, నాగేశ్వరరావు చెప్పారు గనుక, మిస్టేక్ అంటున్నాను' అని సర్ది చెప్పారు పుల్లయ్యగారు. సభలో ఒక్కుమ్మడిగా నవ్వులు వినిపించాయి.

ఆ తర్వాత బహుమతి ప్రదానం జరిగింది. ఉత్తమ నటుడుగా నాగేశ్వరరావు, ఉత్తమ నటిగా శారద, ఉత్తమ హాస్యనటుడుగా రాజబాబు, ఉత్తమ దర్శకునిగా వి. మధుసూదనరావు బహుమతులు అందుకున్నారు. కుమారి కాంచన బహుమతి ప్రదానం చేశారు —

ఉత్తమ సహాయ నటీ నటులుగా ఎన్నికయిన చంద్రకళ, శోభన్‌బాబులకు బహు




మతు లివ్వబోతుండగా — పుల్లయ్యగారు మైక్ ముందుకు వచ్చి 'లేట్ కమ్మర్స్‌కి లేట్ కమ్మరే యివ్వాలి' అన్నారు. సభలో మళ్ళీ ఒకసారి నవ్వులు ముప్పిరిగొన్నాయి. పుల్లయ్యగారి కోరిక ప్రకారం మేడమ్ జమున-వారిద్దరికీ బహుమతులను అందజేశారు — ఆమెకూడా నవ్వుల్ని పంచుకుంటూ.

ఆనాటి ఉత్సవం ఎంతో అందంగా, హుందాగా, సందడిగా జరిగింది. సినిమా నటీనటులు, పత్రికా రచయితలు, నిర్మాతలు, దర్శకులు, పంపిణీదారులు — ఇలా అంతా కలిసి ఒక సమావేశానికి హాజరు కావటం అరుదు. ఇలా అంతమందీ కలిసిన ఆ సమావేశం ఒక ఉత్సవం, ఒక పండగలాగా అనిపించింది. ●

# సినిమా

# హరనాథ్ విజయల ప్రణయానికి అడ్డుగోడ సహకారం!

హరనాథ్, కె. ఆర్. విజయలు ఒకే వీధిలో ప్రక్క ప్రక్క యింట్లో నివసిస్తున్నారు. ఆజానుబాహుడయిన హరనాథ్‌పై అన్నులమిన్న కె. ఆర్. విజయకు మోజు యేర్పడింది. అందాల గుమ్మ విజయపై—హరనాథ్‌కు మోజు కలిగింది. ఇద్దరి కళ్ళు కలిసాయి — ఆ నాలుగు కళ్ళు ప్రేమ పురాణాన్ని మాట్లాడుతున్నాయి. హరనాథ్ యింటికి, విజయ యింటికి అడ్డంగా నిలిచినది గోడ మాత్రమే. గోడకు యిటువైపుగా హరనాథ్, అటువైపుగా విజయ ప్రతి రోజూ కూర్చోవడం, ఒకర్నొకరు కలుసుకోవడం పరిపాటి అయింది. ప్రేమికులిద్దరూ తమ హృదయంలో దాగి వున్న ప్రణయ కావ్యాన్ని పాట మూలంగా తెలుసుకోగలిగారు. వారి మనోభావాలను కవి దాశరథి ఎలా చిత్రించారో తెలుసుకోండి.

రాశాను ప్రేమలేఖ లెన్నో
దాచాను ఆశలన్ని నీలో
భువిలోన మల్లియలాయె
దివిలోన తారకలాయె—ఈ పాటను జి. కె. వెంకటేష్ సారథ్యంలో జానకి, బాలసుబ్రహ్మణ్యం మధురంగా పాడారు ఈ ప్రణయ సన్నివేశాన్ని మహావిష్ణు పిక్చర్స్‌వారి 'శ్రీదేవి' చిత్రంలో చూడొచ్చు. శ్రీ ఆర్. ఎస్. నారాయణ నిర్మిస్తున్న ఈ చిత్రాన్ని బి. ఎస్. నారాయణ డైరెక్టు చేస్తున్నారు 'మనుషులు మారాలి' ఫేం శ్రీ బొల్లిముంత శివరామకృష్ణయ్య సంభాషణలను సమకూర్చిన ఈ చిత్రంలోని ప్రధాన పాత్రలను గుమ్మడి, సూర్యకాంతం, రాజబాబు సంధ్యారాణి, అల్లు రామలింగయ్య, రాధాకుమారి, రోజారమణి, బ్రహ్మాజీ, సాక్షి రంగారావుగార్లు ధరిస్తున్నారు.



"విజయం మనదే"లో
ఎన్.టి. రామారావు, బి. సరోజదేవి

## కారు ప్రేమ

క్యారెక్టరు యాక్టరు నాగభూషణం గారి ముద్దుల కూతురే విజయనిర్మల. అందచందాలకుతోడు సిరిసంపదలు కూడా కలిగిన విజయనిర్మలను ఆమె తండ్రి నాగభూషణం అల్లారు ముద్దుగా పెంచాడు. వాళ్ళింట్లో హీరో కృష్ణ నౌకరుగా చేరాడు. అతన్ని చూస్తే ఎవరో గొప్పింటి బిడ్డ అనే భావం అందరికీ కలుగుతుంది. కాని అతను నాగభూషణం గారింట్లో నౌకరుగా పనిచేస్తుంటాడు. ఒకరోజు కృష్ణ కారువంక తదేకంగా చూస్తుంటాడు. విజయనిర్మల కారు డ్రైవ్ చేస్తుంటే, స్టీరింగ్‌వంక గుడ్లప్పగించి చూడడాన్ని ఆమె గమనించింది. 'నీకు డ్రైవింగ్ నేర్చుకోవాలని వుందా. అయితే నాతోరా. నే నేర్పుతా' నంటూ హీరో కృష్ణను కారులో ఎక్కించుకొని షికారుకు వెళ్తుంది. ఇలా యిలా వీళ్ళ పరిచయం ప్రేమగామారి, పరిణయం స్థాయికి వచ్చింది. ఒకర్నివిడచి మరొకరు ఒక్క నిమిషమైనా విడచి వుండలేకపోయారు. కృష్ణ, విజయనిర్మల ప్రేమకథను కవి నారాయణరెడ్డి ఇలా విపులపరిచారు.

## సినిమా డైరీ

● నటరాజన్ పిక్చర్స్ నిర్మిస్తున్న ప్రథమ చిత్రానికి "ఎవరిని నమ్మాలి" అనే పేరు పెట్టారు. ఈ చిత్రాన్ని ఛాయాగ్రాహకుడు లక్ష్మణ్‌గోరె డైరెక్టు చేస్తున్నారు.

● నవశక్తి ప్రొడక్షన్స్‌వారి షూటింగు ప్రసాద్ స్టుడియోలో జూలై 6 నుండి 9 వరకు జరిగింది. శ్రీ సి. ఎస్. రావ్ దర్శకత్వంలో రామారావు, వాణిశ్రీ, ప్రభాకరరెడ్డి, సురభి బాలసరస్వతి పాల్గొన్నారు.

● జ్యోతి—నవశక్తి కంబైన్స్ నిర్మించనున్న హిందీ చిత్రంలో వోరాజీసాడీ ఒక ముఖ్య పాత్ర పోషిస్తున్నారు. శ్రీ కె. పి. ఆత్మా డైరెక్టు చేసే యీ చిత్రంలో ముంతాజ్, జితేంద్ర నాయకీ నాయకులు.

● రాజేంద్ర ఆర్ట్స్ నిర్మించిన "విజయం మనదే" చిత్రం జూలై 15న విడుదలవుతుంది.

● శ్రీ రమణచిత్ర వారి "మట్టిలో మాణిక్యం" షూటింగు శ్రీ బి. వి. ప్రసాద్ దర్శకత్వంలో [శారదాలో] జూలై 4 నుండి 6 వరకు జరిగింది. జమున, చలం పాల్గొన్నారు.



"సుగుణసుందరి కథ"లో
విజయలలిత, కాంతారావు

కృష్ణ: నీవనీ! నేననీ
లేనేలేవు! లేనేలేవు తెరలు
అడ్డుతెరలు.
విజయనిర్మల: కెరటాలై కిరణాలై
పరుగిడె పరుగిడె సరువాలూ!

పై పాటను శంకర్ అధ్వర్యంలో ఘంటసాల సుశీలగార్లు కమ్మగాపాడారు. ఈ శృంగార ఘట్టాన్ని పద్మశ్రీ పిక్చర్స్ వారి 'అల్లుడే మేనల్లుడు' చిత్రంలో చూడొచ్చు. శ్రీ వి. వెంకటేశ్వర్లు నిర్మిస్తున్న ఈ చిత్రాన్ని శ్రీ పి. పుల్లయ్య డైరెక్టు చేస్తున్నారు. 'కథానాయకుడు' ఫేం భమిడిపాటి రాధాకృష్ణ సంభాషణలను సమకూర్చిన ఈ చిత్రంలోని ముఖ్య భూమికలను సత్యనారాయణ, కృష్ణంరాజు, రాజబాబు, ధూళిపాళ, అల్లు రామలింగయ్య, రావి కొండలరావు రమాప్రభ, బేబిరాణి, బ్రహ్మజీ, మాష్టర్ ఆదినారాయణ, శాంతకుమారి ధరించారు. ఈ చిత్రంలో సావిత్రి అతిథినటిగా కనిపిస్తుంది. విఖ్యాత వెంకటేశ్వర్లుగారి కుమార్తె ఒక ప్రముఖ పాత్రను ధరించింది

# విందు వినోదం నిండిన వికాస మండలి

సురభి బాలసరస్వతి 'వికాసమండలి'ని స్థాపించింది. ఈ మండలిలో నానా సర్వకాలం జమిందార్లు, వ్యాపారస్తులు, అందమయిన అమ్మాయిలు ఖుషీగా, జల్సాగా ఆటపాటల్లో తేలియాడుతుంటారు జీవితాన్ని సుఖసంతోషాల్లో గడపాలంటే 'వికాసమండలి' లో సభ్యులుగా చేరాలి. అక్కడ మనకు 'నీతి, నిజాయతీ' తప్ప మిగతా అన్నీ కనిపిస్తాయి. ఈ మండలికి వచ్చే పెద్దమనుష్యుల్లో ప్రభాకరరెడ్డి ముఖ్యుడు. ఇతడికి విస్కీ త్రాగడం, అందమయిన సుందరాంగుల అందాన్ని గ్రోలడం అలవాటు. ఇతని వలలో నటి వాణిశ్రీ చెల్లెలు రాజేశ్వరి చిక్కింది. పాపం, రాజేశ్వరికి 'వికాసమండలి' వ్యవహారాలు తెలియక 'బ్యూటీకంటెస్ట్'కు పోటీ చెయ్యమన్న తనకు యిక్కడ ప్రయోజనం కల్గుతుందని నమ్మి వచ్చింది కానీ ఈ వాతావరణం ఆమెకు బొత్తిగా నచ్చలేదు. ప్రభాకరరెడ్డి రాజేశ్వరిని బలాత్కారం చెయ్యబోతున్న సమయానికి మీ అభిమాన హీరో రామారావు తన ప్రేయసి వాణిశ్రీతో వచ్చి రాజేశ్వరిని కాపాడి తీసికెళ్తాడు. 'కట్'.

## 56, 57వ పేజీలలో బొమ్మలు:

1. నటి కాంచనవద్ద ఎవార్డు, బహుమతి పాకెట్‌లు అందుకుంటున్న అక్కినేని నాగేశ్వరరావు.

2. ఊర్వశి శారదకూడా ఎవార్డు, బహుమతి పాకెట్లు అందుకుంటున్న దృశ్యం.

3. 'లేట్'గా వచ్చిన జమున 'లేట్‌కమర్' శోభన్‌బాబుకి ఎవార్డు, బహుమతి పాకెట్ ఇవ్వాలని శ్రీ పుల్లయ్యగారి సూచన ప్రకారం !...

4. సంగీత దర్శకుడు కె. వి. మహాదేవన్ బదులుగా అతని కుమారుడు సభకి వచ్చారు.

5 6, ముఖ్య అతిథి, ఉత్తమ దర్శకుడు ...

7. నట సామ్రాట్‌కి ఇరువయిపులా ఇద్దరు ఉత్తములు ...

8 ఉత్తమ హాస్యనటుడు రాజబాబుకి ఒక గుత్తి

9. విందు, వేదిక ...

10. ఊర్వశి, ముఖ్య అతిథి, బహుమతి ప్రదానం చేసినవారు...

11. సభలో అందరినీ అద్భుత వీణాగాన కచ్చేరీతో ముగ్ధులని చేసిన పదేళ్ల బాల చిరంజీవి గాయత్రి...

12. అధ్యక్షులు, మైక్రోఫోన్...

13. అక్కినేని నాగేశ్వరరావుని లోపలికి తీసుకువస్తున్న శ్రీ శేషగిరిరావు...

14. ఊర్వశికి పూలమాల !

15. ఉత్తమనటి, శ్రీ శేషగిరిరావు...

16. ఆలస్యంగా వచ్చినా పాటపాడిన ముఖ్యఅతిథి, పి.బి.శ్రీనివాస్...

17. అవార్డు, పాకెట్ అందుకుంటున్న ఉత్తమ సహాయనటి ...

అన్నారు దర్శకుడు సి. ఎస్. రావ్ ఈ సంఘటన నవశక్తి పిక్చర్స్‌వారి తాజా పౌరాణిక చిత్రంలో కనిపిస్తుంది. శ్రీ గంగాధరరావు నిర్మిస్తున్న ఈ చిత్రానికి ఆరుద్ర సంభాషణలను, శంకర్ జైకిషన్లు సంగీతాన్ని, సత్యనారాయణ ఛాయను, మారన్న శిల్పాన్ని నిర్వహిస్తున్నారు. ఇప్పటికి ఈ చిత్రం పదమూడు రీళ్లు తయారైంది. ఈ చిత్రంలోని ప్రధాన పాత్రలను నాగయ్య, రేలంగి, పద్మనాభం, హేమలత, శ్యామల, శ్రీరంజని, రమణారెడ్డి ధరిస్తున్నారు.

## కొత్త దర్శకుని పరిచయం

విజయ—సురేష్ కంబైన్స్ నిర్మిస్తున్న సాంఘిక చిత్రం యొక్క షూటింగు జూలై 5 న ఉదయం అయిదు గంటలకు వాహినీలో ప్రారంభమైంది. శ్రీ రామానాయుడు ఈ చిత్ర దర్శకత్వాన్ని బాపయ్యకు అప్పగించడం అభినందించదగ్గ విషయం. జి. వి ఆర్. శేషగిరిరావుకు 'సిపాయి చిన్నయ్య' దర్శకత్వాన్ని యిచ్చిందికూడా శ్రీ నాయుడు గారే. ఈ కొత్త చిత్రానికి తురయుపార్ మూర్తి కథను, బొల్లిముంత శివరామకృష్ణయ్య మాటలను సమకూర్చారు. ముఖ్యపాత్రలను జగ్గయ్య, నాగభూషణం, వాణిశ్రీ, దేవికలు ధరిస్తున్నారు జూలై 10 న చిత్రానికి సంబంధించిన కొన్ని పాటలు రికార్డు చెయ్యబడ్డాయి. జూలై 24 నుండి నిర్విరామంగా షూటింగు జరుగనున్న ఈ చిత్రానికి ఎస్. ఎస్. లాల్ ఛాయను, రాఘవులు సంగీతాన్ని, మార్తాండ్ కూర్పును, రాజేంద్రకుమార్ శిల్పాన్ని నిర్వహిస్తున్నారు

## సినిమా

## సినిమా అవుతున్న నవల

కాస్ట్యూమ్ శాఖలో సిద్ధహస్తుడనిపించుకుంటున్న శ్రీ వి. ఎస్. గాంధి శ్రీమతి ద్వివేదుల విశాలాక్షి వ్రాసిన 'వారధి' నవలను 'రెండు కుటుంబాల కథ' పేరుతో చిత్రం నిర్మిస్తున్నారు. శ్రీ సి. ఎస్ రావ్ దర్శకత్వంలో సర్వాంగ సుందరంగా తయారవుతున్న ఈ చిత్రానికి పినిసెట్టి మాటలను, ఘంటసాల సంగీతాన్ని సమకూరుస్తున్నారు. చిత్రంలోని ప్రధాన పాత్రలను 'షావుకారు' జానకి, కృష్ణ, విజయనిర్మల, ప్రభాకరరెడ్డి, రాజబాబు, శ్యామల, ధూళిపాళ, హేమలత, బాలకృష్ణలు పోషిస్తున్నారు పూర్ణా పిక్చర్స్ ద్వారా విడుదలయ్యే ఈ చిత్రం పదిరీళ్లు తయారైంది.

## నటి లక్ష్మికి కళ్యాణం

'మెరుపు వీరుడు' చిత్రంలో కథానాయికగా నటించిన లక్ష్మి తన జీవిత కథానాయకుణ్ని ఎన్నుకుంది. అతడిపేరు భాస్కరన్. జీవితభీమా సంస్థలో వున్నత పదవిలో వున్నాడు సౌ. లక్ష్మి చి. భాస్కరన్‌ల వివాహం జూలై 8 న 'హేమమాలిని' కళ్యాణమండపంలో వైభవంగా జరిగింది. పెండ్లికూతురు లక్ష్మి నీలం జరీఅంచు దమయంతి పచ్చపట్టు చీరె, ఎదేరంగు జాకెట్టును ధరించి వుదయం గం 9—30 లకు కళ్యాణమండపానికి వేదోక్తంగా తీసుకురాబడింది. పెండ్లికుమారుడు భాస్కరన్ వంచకచ్చం కట్టిన పట్టుధోవతి, పట్టు పైపంచె ధరించి మండపానికి వచ్చాడు. చలనచిత్ర పరిశ్రమ ప్రముఖులనేకులు వచ్చి వధూవరులను ఆశీర్వదించారు 'మక్కళ్ తిలగం' శ్రీ ఎం. జి. రామచంద్రన్ (మేకప్‌తో) పతి సమేతులగా వచ్చి తన శుభాకాంక్షలను అందజేశారు. ఆరోజు లక్ష్మిని ఆమె

## మీకు తెలుసా?

నటి 'షావుకారు' జానకి యింటికి ఎవరు వచ్చినా, వాళ్లకు ఆమె దర్శనమూ దొరుకుతుంది, ఆమె మనసు విప్పి మాట్లాడుతుంది కూడా.

నటుడు నాగేష్ సినిమాల్లో నటించడానికి ముందు 'ఏమాలి' అనెడి నాటకాన్ని ప్రదర్శించేవాడు.

దర్శక, నిర్మాత శ్రీధర్ నడుపుతున్న 'చిత్రాలయ' పత్రికలో చిత్ర సమీక్షలు వ్రాయకూడదని నిర్ణయించారు.

పక్షిరాజా పిక్చర్స్ శ్రీరాములు నాయుడు యిప్పుడు బెంగుళూరులో 'చాముండేశ్వరి' పేరున ఒక స్టూడియో కట్టదలిచారట.



"అల్లుడే మేనల్లుడు"లో కృష్ణ, విజయనిర్మల

యింటికి, ఆమె తల్లి రుక్మిణి సాగనంపింది

## విజయంలో రహస్యం

సంగీత దర్శకుడు శ్రీ కోదండపాణి పరిచయంచేసిన గాయకుడు శ్రీ ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం నేటి బిజీ ప్లే బాక్ ఆర్టిస్టు అయ్యాడు. నేను ఏస్టూడియోకు వెళ్లినా, బాలసుబ్రహ్మణ్యం ఫియట్ కారే కనిపిస్తూవుంది. తెలుగు, తమిళ, కన్నడచిత్ర నిర్మాతలనేకులు బాలసుబ్రహ్మణ్యాన్ని పాడమని కోరడానికి కారణమేమై వుంటుంది? అనెడి సందేహం నాకు కల్గింది. బాలసుబ్రహ్మణ్యం కరెక్టుటైంకు రావడం ఒకటి; ఒకటికి పదిసార్లు రిహార్సలు చెయ్యడం, సంగీత దర్శకుల సలహాలను పాటించడం; కో—ఆర్టిస్టుతో సహకరించడం, పాటకు కావలసిన సంగతులను మధురంగా పల్కడం; ప్రేక్షకులు అతని కంఠమాధుర్యాన్ని వినాలనడమే, అతని ప్రగతికి కారణం అనిపించింది.

—శ్రీనివాస్ ●

---

**అవీ.. ఇవీ:**

### లక్ష్మీ రఘురామయ్యగారికి సన్మానం

న్యూఢిల్లీ ఆంధ్ర సంఘం వారు శ్రీమతి లక్ష్మీ రఘురామయ్యగారు అధ్యక్షులుగా ఎన్నిక అయిన సందర్భంలో వారికి సన్మానసభ చేశారు. ఎందరో ప్రముఖులు ఈ సభలో ప్రసంగించారు. సభకి శ్రీ బుర్రా వెంకటప్పయ్యగారు అధ్యక్షత వహించారు. కార్యదర్శి శ్రీ యార్లగడ్డ వెంకన్న చౌదరిగారు వందన సమర్పణ చేశారు.

*    *    *

విశాఖపట్నం, శ్రీకాకుళం జిల్లాలలో భామాకలాపం. గొల్లకలాపం బాణీలలో కృషి చేస్తున్న తూర్పుబాణీ భాగవత కళాకారులు సమావేశము ఆంధ్రప్రదేశ్ సంగీతనాటక అకాడమీ నిర్వహణలో ఆంధ్రప్రదేశ్ నృత్యకళాపరిషత్ ఆధ్వర్యమున శ్రీ గీతా నృత్య కళామందిరిలో 16, జూన్ ఉదయం 10 గంటలకు శ్రీ వసంతరావు వెంకటరావుగారి అధ్యక్షతన సమావేశము జరిగినది రెండు జిల్లాల నుండి ప్రముఖ భాగవత కళాకారులు సుమారు యిరవై మందివరకు సమావేశమునకు హాజరైనారు. [కార్యదర్శి ఆం. ప్ర. నృ. క. ప.]

● ● ●

పిచ్చా - పాటి

## అవుట్‌డోర్‌లో అవస్థలు!

అవుట్‌డోర్స్‌లో షూటింగ్ సక్రమంగా జరుపుకు రావాలంటే ఆర్టిస్టుల సహకారంతోపాటు, సూర్య భగవానుడి సహకారం, దయ పరిపూర్ణంగా ఉండాలి. ఆయన అనుగ్రహం లేకపోతే — ఇక అవాళ షూటింగ్ అంతా అస్తవ్యస్తంగా తయారవుతుంది. ఆ తర్వాత నిర్మాతకు ఎక్కడలేని చిరాకూ పుట్టుకొస్తుంది. అవుట్‌డోర్ అనేసరికి బోలెడంత డబ్బు ఖర్చు అవుతుంది గనుక...డబ్బు ఖర్చు అయినా పని జరిగితే ఫరవాలేదుగాని, పని జరక్కపోతే బాధే మరి—ఎవరికైనా.

అవుట్‌డోర్ అంటే ఉదయం 7 గంటలకల్లా లోకేషన్‌లో వుండాలి. డే (పగలు) షూటింగ్‌కి సాధారణంగా ఎవరూ జనరేటరు ఆర్క్ లాంప్స్ తీసుకు వెళ్లరు. ఏరీఫ్లెక్స్ కెమెరా అవసరమైన లెన్స్, ట్రాక్ ట్రాలీ రిఫ్లెక్టర్ మాత్రం తప్పకుండా తీసుకు వెళ్తారు. సాంగ్ పిక్చరైజేషన్ వుంటే ప్లే బాక్ యంత్రంకూడా ఉంటుంది.

లొకేషన్ దగ్గరయినా, దూరమయినా ప్రొడక్షన్ మనుషులు మేకప్ అసిస్టెంట్స్, కాస్ట్యూమ్స్ అసిస్టెంట్స్, దర్శకుడు — ఆయన అసిస్టెంట్స్, కెమెరామన్ — ఆయన అసిస్టెంట్స్, అవుట్‌డోర్ ఎక్విప్మెంటు తాలూకువాళ్లు ఏడెనమండుగురు...ఆర్టిస్టులతోపాటు విధిగా ఉంటారు.

తీరా ఇంతమంది జనాన్ని తీసుకొచ్చి అవుట్‌డోర్‌లో షూటింగ్ అనుకున్నాక, ఎండ రాకపోతే మీరే ఆలోచించండి ఎలా వుంటుందో?

ఆ మధ్య నేను మిత్రులు వై. వి. రావ్‌గారి 'పగసాధిస్తా' అవుట్‌డోర్ షూటింగ్‌కి 'యేర్కాడు' వెళ్లాను. షూటింగ్ దూరాన ఎక్కడో కాఫీ ఎస్టేట్స్ అవి దాటింతర్వాత టాప్ హిల్‌మీద జరుగుతోందన్నారు. వెళ్లాం. భూమ్యాకాశాలు కలిసినట్టుగావుంది అక్కడ. ఊపిరి గట్టిగా పీల్చవలసి వస్తోంది. 'ఇదేమిటి?' అన్నా రావుగారితో. 'గాలిని హిల్ కవర్ చేసేసింది. గాలి తక్కువగా వస్తుంది యిక్కడ' అన్నారు. అప్పుడు ఎండ లేదు. వస్తుందని అంతా ఎదురు చూస్తున్నారు; ముగ్గురు నలుగురు ఒకేచోట చేరి జట్లుజట్లుగా కూచుని కబుర్లు చెప్పుకుంటున్నారు. ఆరోజూ రాలేదు, ఆ మర్నాడూ రాలేదు ఎండ. టాప్‌హిల్‌కి ఎక్కటమూ, దిగటమూ తప్ప షూటింగే జరగలేదు.

మూడోరోజు ఎండ రాలేదు కాని, మరీ చీకటిగాను లేక, మరీ వెలుగ్గానుకాక బ్రైట్‌గా వుంది. కెమెరామన్ శ్రీ యస్ యస్. లాల్ సాహసించి కొన్ని ఛేజ్ దృశ్యాలను, ఫైట్స్‌ను తీశారు. 'ఎండ లేకుండా తీశారు, ఎలా వస్తాయో'ననే భీతి అవాళ అక్కడ చాలామందిలో వుంది కాని, లాల్ మాత్రం ఎంతో కాన్ఫిడెన్స్‌తో ఉన్నారు. రష్ ప్రింటు చేసింతర్వాత చూస్తే ఎంతో మంచి ఫలితాలు వచ్చాయి. ఇలాంటి టెక్నిక్‌తో ఎండ లేకపోయినా చక్కని ఫలితాలని తీసుకు రాగల యువఛాయాగ్రాహకులలో నాకు తెలిసినవారిలో శ్రీ యస్. వెంకటరత్నం ఒకరు. ఒక చిత్రంలో ఒక పాట మొత్తం ఎండ లేకుండానే తీశారాయన. ఎంతో బాగ వచ్చింది. ఒక్కోసారి ఛాయాగ్రహణదర్శకుడు యిలా చొరవ తీసుకుని పనిచెయ్యకపోతే— నిర్మాత ఆర్థికంగానేకాక, ఆర్టిస్టుల కాల్‌షీట్స్ దొరక్కకూడా ఇబ్బందిపడవలసి వస్తుంది. అవుట్‌డోర్‌లో ఎన్నో అవస్థలు ఎదుర్కోవలసి ఉంటుంది.

—మోహన్‌కుమార్.

# అవీ-ఇవీ...

### కాకినాడలో పి. పుల్లయ్య పెవిలియన్

కాకినాడ సూర్య కళామందిరంలో 'పి పుల్లయ్య మంటపాన్ని' నిర్మించారు. ఈ మంటపాన్ని జిల్లా కలెక్టరు శ్రీ యల్. మాలకొండయ్యగారు ఆవిష్కరిస్తూ కీ. శే. పి. పుల్లయ్యగారు తెలుగు చలన చిత్ర పరిశ్రమకి తండ్రిలాంటివారని ప్రస్తుతిం చుతూ ఈ మంటప నిర్మాణానికి పూనుకున్న పుల్లయ్య గారి కుటుంబం వారిని అభినందించారు. సరస్వతి గానసభ ప్రెసిడెంటు శ్రీ కొప్పిరెడ్డి శ్రీ రామచర సింగరావుగారు సభకి అధ్యక్షత వహించి మంటపాన్ని డిజయిన్ చేసిన శ్రీ తాతబ్బాయికి నూతన వస్త్రాలు బహూకరించారు. గానసభ సెక్రటరీ శ్రీ సి. యన్. శ్రీనివాసరావుగారు సంస్థ కార్యకలాపాలను వివరిం చారు. అనేకమంది పుర ప్రముఖులు సభకి హాజరై కార్యక్రమాన్ని జయప్రదం చేశారు. (ఒ. వి.)

* * *

హైదరాబాద్, సికిందరాబాద్ నగరాల యువ జనం కొందరు 'కళావాణి' అనే సంస్థని నెలకొల్పి సాంస్కృతిక, సారస్వత కార్యక్రమాలని ప్రోత్స హించటానికి పూనుకున్నారని తెలుస్తోంది. ఒ.వి.]

* * *

ప్రముఖ కథా, నవలా రచయిత్రి శ్రీమతి బి. వి యస్. అచ్యుతవల్లికి గృహలక్ష్మీ స్వర్ణ కంకణం బహూకరించబడిన సందర్భంగా ఇటీవల శ్రీకాకుళం స్త్రీ సమాజం ఘనంగా సన్మానించి సత్కరించారు. [ఒ. వి.]

* *

ఆంధ్రసమితి రాంచీ హిందూస్థాన్ స్టీల్ వా కమ్యూనిటీ హాలులో తన 1969—70 వార్షికోత్స వమున జూన్ 14న సమితి పోషకులు హెచ్ ఇ. సి. టెక్నికల్ ఎడ్వయిజర్ అయిన శ్రీ ఎమ్. కృష్ణ స్వామి గారి అధ్యక్షతన, ఘనంగా జరుపుకొన్నది. [ఒ. వి.]

* * *

పూనా ఆంధ్ర సంఘం వారిచే స్థాపించబడిన ఆంధ్రాస్కూలు జూన్ 8, 1970 ఉదయం 11.30 గంటలకు వినాయకపూజ, సరస్వతీ పూజతో ఆరంభమైనది.

నర్సరీ మొదటి తరగతులు నడుస్తున్నవి. విద్యా బోధన ఇంగ్లీషులోనే జరుగుతుంది. హిందీ, తెనుగు కూడ బోధిస్తారు.

పిల్లలకు రాకపోకలకు సౌకర్యములు కూడ స్కూలు కమిటీవారు కలగచేస్తున్నారు.

ఆంధ్రప్రదేశ్ విద్యాశాఖామాత్యులు శ్రీ పి వి. నరసింహారావుగారు ఈ మధ్య పూనా వచ్చినపుడు ఆంధ్రాస్కూలును అసోసియేషనను సందర్శించి చర్చలు జరిపినారు ఆ సందర్భములో ఆయన స్కూలుకు కావలసిన సహాయము చేయుటకై అంగీకరించినారు.

తెనుగు పిల్లలకై బాలానందం ప్రోగ్రాం పెట్టా లని కూడ అనుకుంటున్నారు. [ఒ. వి.]

### విషవలయం నాటిక

"విష వలయం" నాటికను బెంగుళూరులోని 'తెలుగు విజ్ఞాన సమితి' యేటేటా ఉగాది సంద ర్భంగా జరుపు నాటికల పోటీలో పాల్గొనేందుకు 1969 జనవరిలో ప్రాశాము ఇండియన్ ఇన్‌స్టి ట్యూట్ ఆఫ్ సైన్సులోని తెలుగు సాంస్కృతిక సమితి తరపు 1969 నాటికల పోటీలో 'విష వలయం' నాటిక పాల్గొన్నది. ఈ నాటికకు ప్రదర్శ నలో ద్వితీయ బహుమతి లభించింది. శేఖర్‌బాబు పాత్ర ధరించిన శ్రీ నరేంద్రబాబుకు నటనలో మూడవ బహుమతి లభించింది.

ఆ పోటీలో "విష వలయం" నాటికలో వివిపాత్రలు ధరించిన నా మిత్రులు శ్రీయుతులు నరేంద్రబాబు, కాశీ విశ్వనాథ్, వెంకటేశ్వర్లు, రామకృష్ణారావు, రామి రెడ్డి మరియు రామకృష్ణగార్లకు కృతజ్ఞతలు.

"విష వలయం" నాటిక ప్రదర్శింపగోరువారు నా అడ్రసులోని మార్పును గమనించవలసినది: అడ్రసు యల్. వి యల్ యన్ శర్మ, లెక్చరర్ ఇన్ ఇండస్ట్రియల్ మేనేజిమెంటు, హ్యుమానిటీస్ అండ్ సోషల్ సైన్సెస్ డిపార్టుమెంటు, ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ, మద్రాసు—36.



మద్రాసు వాణీమహల్‌లో ఇటీవల నృత్యప్రదర్శనం ఇచ్చిన కుమారి అనురాధా గోవిందాచారి.

Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press; 6 & 7 Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.

